ఫోన్: 2066

సంపుటి 7

టెలిగ్రామ్: హిందీసంఘ్

సంచిక 9

# స్రవంతి

సాహిత్య మాసపత్రిక

*



*

దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర

959 ఖైరతాబాదు, హైదరాబాదు - 4

సంవత్సర చందా రు. 4-00

డిసెంబరు 1960

విడిప్రతి 35 నయాపైసలు

Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide Proceedings Dis. No. 30/55 dated 6th January 1955.

# ఈ సంచికలో

## సంపాదకీయం

మానవుడు ప్రాణములను పోగొట్టుకొనుటకైనను అంగీకరించును గాని తన అలవాటులను విడచుటకు సాధారణముగ అంగీకరించడు. అలవాటులు మనకు, సంఘమునకు ఉపకరించునవి మాత్రమే మనము అలవరచుకొనవలయునని ఆర్యోక్తి. ఇందులకు వివేకము, విచక్షణ జ్ఞానము చాల అవసరము. అవి ఉన్నవారు తమ ప్రయత్నములో పరిసర ప్రాంతముల వాతావరణమును కూడ అనుకూలమైనదిగ చక్కబరచుకొనగలరు. ప్రయత్నము వ్యక్తిగతముగను, సమిష్టిగతముగను కూడ సాగించవచ్చును. ప్రగతికి ప్రయత్నము దోహదమిచ్చుచుండును. ప్రయత్నలోపము పతనమునకు దారి తీయుచుండును.

గాంధీ మహాత్ముడు తనను తాను బాగు చేసుకొనుచు సంఘమును దేశమును మాత్రమే గాక లోకమును కూడ బాగు చేయుటకు ప్రయత్నించినాడు. సాధారణ మానవునిగ మన మధ్యనే ఉంటూ తనసాధన సంపత్తి వలన మహాత్ముడనిపించుకొన్నాడు. ఆయనను అనుసరిస్తున్నట్లు అభినయించుచు చాలామంది ముందుకు ఒక అడుగు కూడ వేయలేకపోతున్నారు. మహాత్ముడు మనకు రాగ ద్వేషములను వదలి రాష్ట్రభాషకు హిందీ-హిందుస్తాని యే తగిన భాషయని ప్రబోధించినాడు. మాతృ భాషలతో పాటు రాష్ట్రభాషకు యివ్వ వలసిన స్థానమును కూడ నిర్ణయించినాడు. ఇంగ్లీషును భారతీయులు ఎలా ఉపయోగించుకోవలసినదీ కూడ ఖచ్చితముగా చెప్పియున్నాడు. కాని మనకు స్వరాజ్యం లభించి పదమూడేండ్లు గడచినను మన అలవాట్లు మనం మానలేదు. రాష్ట్రభాష విషయంలో మనద్వేషాలు యథాస్థాయిలోనే ఉన్నవి. సంఘ శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని మనము వ్యవహరించుకోలేక పోతున్నాము.

ఔత్తరేయులు దురహంకారపూరితులనీ, దాక్షిణాత్య భాషలలో ఏ ఒక భాషనూ వారభ్యసించుటలేదనీ, అట్టి స్థితిలో ఆ ఔత్తరీయ భాషయైన హిందీని మనము ఎందుకు అభ్యసించాలనీ ప్రశ్నించుకొంటున్నాము. ఈ ప్రశ్న దురహంకారానికీ, ద్వేషమునకు ఏమంత దూరమైనది కాదనిమామనవి. ఔత్తరాహులు తప్పు చేస్తున్నారని అంటూ దాక్షిణాత్యులు తప్పు చేయకూడదు. మాతృ భాషలతో

పాటు హిందీని కూడ మనము అభ్యసించినచో వారి తప్పు వారికి తప్పక బోధపడగలదు, దాక్షిణాత్య భాషలలో ఒక భాషను అభ్యసించని లోపమును అనుభవం మీదట స్వయముగ తెలిసికొని అభ్యసించగలరు. రాష్ట్ర భాషలను, రాజభాషలను అభ్యసించుటలోనూ కన్యాకుమారి నుండి హిమాచలం వరకు ప్రచారం చేయుటలోనూ చారిత్రకంగా ముందంజ వేసినది దాక్షిణాత్యులే గదా; శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు వల్లభాచార్యులు మొదలయిన మహానుభావులు దక్షిణ భారతీయులే; ఈ నాడు వారు తమ తమ సేవా త్యాగ భావముల వలన అఖిల భారతీయులుగ పరిగణింపబడుచున్నారు.

నేడు కన్నడిగులు హిందీని అభ్యసించుటలో చాల ముందు ఉన్నారు. మలయాళులు మరొక అడుగు ముందు వేయాలనే ఉత్సాహంతో ఉన్నారు. తమిళ సోదరులు పగలంతా నల్ల జెండాలతో 'హిందీ ఒళిగ' అని కేకలు వేయుచు రాత్రిపూట చక్కగ హిందీని అభ్యసించుచున్నారు. ఎటు చూచీ ఆంధ్రులు హిందీ ప్రచార ఆందోళనలో మొట్టమొదట 1918 కి పూర్వమే ముందడుగు వేసి తక్కిన ప్రాంతీయ సోదరులకు మార్గదర్శకులైన వారు ఈనాడు అసమంజస స్థితికి లోనుగావడం ఆలోచనీయము.

దక్షిణ భారత హిందీ ప్రచార సభ 25 వ పట్ట ప్రధానోత్సవము కార్యాధ్యక్షులు శ్రీనివాస అయ్యంగారి అధ్యక్షతను 6-11-60 న జరిగినది. డాక్టరు బెజవాడ గోపాల రెడ్డి గారు షుమారు 500 మందికి పట్ట ప్రదానం చేశారు. అందులో ఆంధ్రుల సంఖ్య గడచిన సంవత్సరముల దృష్ట్యా తమిళ, కన్నడ. కేరళుల సంఖ్య కంటె తక్కువగా ఉంది. సంఖ్యలోనే గాదు విద్యాప్రమాణంలోను కూడా అలాగే ఉంది. ప్రత్యేకంగ ఆంధ్రుల దృష్టిని ఆకర్షించుచు శ్రీ గోపాల రెడ్డిగా రిచ్చిన స్నాతకోపన్యాసం ప్రశంసనీయము. ఆంధ్రులు ఉత్సాహముతో, యథాశక్తిగ హిందీ ప్రచారోద్యమంలో ముందంజ వేయుదురని ఆశించుచున్నాము.



# శిల్ప సూక్తి

-శ్రీ బాడాల రామకవి

(అనంతపురము జిల్లాలోని హిందూపురమునకు తొమ్మిది మైళ్ళ దూరములో లేపాక్షి ఆలయమున్నది. ఇది విజయనగర రాజుల కాలము నాటిది. ఆనాడు భారతీయ సంస్కృతి కొండ గోపురాలను దాకింది. దాని ఫలితమే పాషాణాలు సైతము దివ్య సుందర మూర్తులయి నేటికిని మనకు కన్నుల పండువ గూర్చుచున్నవి. తమ్ము చూడవచ్చిన నేటి యాంత్రిక మానవునితో అవి మాటల కందని మనసుల కదిపే ఒక సందేశాన్ని ప్రసాదిస్తాయి. ఆ యమృత సందేశమే యీ పద్యకృతి.)

ఓ ప్రజా బంధు! ఓ కర్మయోగి! ఓ ర
సార్ద్ర హృదయ! నిన్నేనోయి ఆలకింపు
మణపరాని మా హృదయ వేదన యొకింత,
తెలియరమ్ము మానవ మహోజ్జ్వల చరిత్ర.

ఎన్ని నాళ్ళయ్యెనో, యెద దన్నుచున్న
భావ మెలుగెత్తి యొకసారి పల్కుటకును,
బరువుతీరగ మారాతి బ్రతుకులోని
ఆత్మవేదన తొలంగ నెమ్మరయరమ్ము

నన్నూరేండ్లు గతించి పోయినవి జన్మంబంది, యానాటి
మీ విజ్ఞానంబులు మీ వెలుంగు బ్రతుకుల్ విస్పష్టమున్ జేయ
గా, నెన్నోరీతుల యత్నముల్ సలుప, మేమేదీ యొకండైన, ఏ
మన్నా మీకథయంచు నొక్క మృదు వాక్యంబైన వాక్రుచ్చెనే?.

నరరూపంబులఁ బుట్టు యంత్రముల కన్నారం గనుంగొంచు, వే
సరె మా జీవితముల్ నెలల్ కడకహో సంవత్సరాలే గతిం
చె, రసాస్వాదన జీవి యొక్కడయినన్ స్నిగ్ధాత్ముడై పల్కడె
వ్వరే దోసంబని యేరితోఁబలుక యీ భారం బికన్ దీరునో.

బండలటంచు మా బ్రతుకు బండల చేయక, మీ ఋషుల్ కళా
ఖండములై వెలుంగ, మము గౌరవ మొప్పగ, యోగశక్తులున్
పండగ, మా యెదన్ గనిరి, హారి మహామహిమంబు లెల్ల మా
గుండెల నిండి పొర్లె, కనుగొంటిమె, వారి తపఃప్రభావముల్.

కన్నులు కాయలయ్యె, యెద కమ్మదనమ్ము లడంగిపోయె, మా
పున్నెము బుగ్గియయ్యె, నిటబోయెడి వారల జూచిచూచి, మా
కున్న రసార్ద్ర శక్తులయహో! యెటనోబడి మాయమయ్యె! మా
ప్రన్నని మేను లీగతి శిలాకృతులై, మిము జూడజూచెదుః.

ఆ మనోహరా నంద యోగా శ్రమముల,
అతు లర మోడ్చు నిర్మల ధ్యానమహిమ,
నీ ప్రకృతి ననుస్యూతమే యీశ్వరాంశ
లణువణువునం దెలియు యోగు లరయరారు.

దేశ కాలంబుల గెలచు దివ్యశక్తి
నే తపోబలంబున గరగించి, మాశి
లా హృదయ పాత్రల నమృత రసము నింపి
రో! తెలియలేము మీ వారి యోగశక్తి.

ఆకు కదలికలో జీవి తార్థమరసి
పూల చెక్కిళ్ళ పుణ్యయోగాల దెలిసి,
పాపనవ్వుల యానంద భాగ్యమందు
యోగు లెచటనో యీనాడు దాగినారు.

అర్థికోన్మాద పూరితం బైన జగతి,
భయమె, పడిపోయె, భక్తియా పట్టుదాయె,
హృదయ మెప్పుడో కుప్పకూలంప నీ శవాల
చుట్టు కొత్త దయ్యమ్ములు లేవా! కొట్టుకొనును.

అంతులే నీ దురాశా దృగంచలాలు,
గాలి దూరని యడవుల కత్తరింప,
క్రొత్త రోగాల పండించు కొనెను గాని,
అస్థి పంజరాలకు పట్టెడన్న మిడవు.

మీ కటాక్ష వీక్షణ కొనల్ సోకగానె,
నిట్ట నిలువున కొండలు నీఱు నగుచు,
మింటికెగసె మీ గరువపు మేడలటనె,
ఔర! ఫాలనేత్రుని జూపు వ్యర్థమయ్యె.

ఆశ లుమిసెడి మీ కన్నులా ఎడారి
నే సరోవరంబుగ నొనరించు, గాని
భువన మోహన స్వామికే పురుడు దీర్చు
పార్వతీ కటాక్ష శ్రీల భంగపరచె.

కాలు గదపక విశ్వచక్రంబు జుట్టి,
చెమట నూడ్వక కార్యపు చిక్కులూడ్చి,
పొట్టివాడైతి పుట్టెడు బుద్ధు లెగయ,
కండబలమును ఆత్మనిగ్రహము దప్పె.

మరణమరికట్టి, జననమ్ము పెరుగ నీక,
బ్రతుకు చెడిపోవ, చేతనా ప్రకృతి నిలుప
మహిషుడై పోయె యీ నాటి మనుజుడకట!
శక్తితో చెలగాటంబు శాంతి నిడదు.

రాక్షస బలంబు మెఱసి యంత్రంబ యగుచు
మనిషి మనిషిగా బ్రతుకుటే మరచినాడు,
కడకు తల్లిబిడ్డల కున్న గాఢరక్తి
తీరిపోయె, యీ పాడు కృత్రిమ జగాన.

వేయి మొగ్గలు తృటిలోన వెళ్లి విరిసి
స్నిగ్ధసౌందర్య మొలకించు జీవితాలు
పుక్కిట పురాణగాథలై పూడు చుండె,
అన్న ! నరజన్మ మీ రీతి వ్యర్థమయ్యె.

పసిపాప నునుబుగ్గపాల నవ్వులఁగాంచి
యానంద మందని యంధు డొకడు,
ప్రియురాలి తొలి సిగ్గు విరియంగ అమృతంబు
కనలేని కామాంధకారి యొకడు;

నిండుదనం బెల్ల పండిన మానవ
త్వంబుతో స్వార్థంబు దరచు నొకడు,
ప్రకృతిలో గల పరాత్పర దివ్య శక్తుల
తలచి తరింపని దాసు డొకడు;

పరువులిడెడి యీ పాడు ప్రపంచమందు
రావణాసుర శీర్షంబులై మొలచెడి
కోర్కెలే రామ బాణంబు కోయగలదొ !
శాంతి సౌఖ్యంబు లెప్పుడీ జాతి కనునొ !

కలకల నవ్వు మొగ్గల వికాసము నంగల యీశ్వరాంశ సం,
ధ్యల జిపురించి హృద్గగన స్పందము దిద్దు కళా విభూతి, వె
న్నెల నును సోగతీవల జనించి స్రవించు సుధామృతంబు, క
న్నుల బడవాయె, మానవ మనోహర శక్తులు మాసిపోయెడిన్.

అణుగత శక్తులందరమ చద్భుత సృష్టి నెఱుంగు సత్య సా
ధనుల తపః ఫలంబులు కుతంత్రులచే బడి, బద్ధులై, జగ
జ్జనని యసార్ఘ్య గర్భసల సంతతి సర్వము కాల, కాల కం
[illegible] చుండె ఘటచ్ఛటార్భటుల్,

క్షణములను కాల పురుషు సూక్ష్మ పునరాల
బట్టి పిండు చున్నారేదో, స్వార్థమెంచి
ఈ దురాశా పిశాచాల కెదురు లేదు
కమ్మదన ముట్టిపడు యెదల్ గడ్డలయ్యె.

అగ్ని గోళ మయ్యె నాత్రయీమూర్తి, వి
ద్యార్థి పుస్తకమ్ము నయ్యె వేధ,
మాత్మ నిగ్రహ మన, యది ఛాందసం బందు
రీ శవాలయాల యెపుడు బ్రతుకు!

పుడమి ముడుచుకొనియె భూధరాల్ తలయొగ్గ,
కదలి వెన్క కరిగె గాలి కదల
వెఱచె, యింత యయ్యు వీరి దాహ మదేమొ!
ఆర కంబరాని కంగ లార్చు.

పొడి పొడి చేసెద వకటా!
జడ మయమే ప్రకృతి నెల్ల సత్యం బరయన్,
వెడ మార్గము వట్టెదు నీ
యెడద నడగు పాల కడలి నెరుగని బుద్ధిన్.

అన్నా! నీ యీశ్వర సం
పన్నత నీ చేత చెడియె భస్మాసుర సం
పన్నతయై నీ మదిను
త్పన్నంబౌ మోహ మాత్మ తత్త్వమె తొలచెన్.

ఈ పకృతి పరిశీల నా కృత్య మింక
చాలు చాలు మా గుండెలు జారిపోయె
గడియ గడియకు దాసులై మడయు మిమ్ము
కానలేక మా బ్రతుకె పాషాణమయ్యె.

ఈ ప్రళయాగ్ని పర్వతము లింకెడి శాంతి పథమ్ము
నొందు, మే మే ప్రవచింతు మియ్యది, ఋషీంద్రులు దెల్పిన
మార్గమయ్యె. సత్య ప్రియవాక్సులం గల రసామృత ధారల గ్రోలి,
పూర్ణ భావప్రణయ ప్రపంచమున పాడుము విశ్వజనైక్య గీతికల్

దురభి మాన దుర్బీజమ్ము తొలచి వైచి
స్వార్థ జీవన దోహదాల్ జార కొంత
విశ్వ విద్రోహ వృక్షమ్ము విఱిగి పడగ
పొటు పడు మయ్యె విశ్వ సౌభాగ్యమునకు.

ప్రతి పదార్థాం తర ప్రభావంబు, ప్రకృతి
సహజ సౌందర్య దేవతా శక్తి, నాత్మ
దెలిసి యానంద ముగ్ధత తేలు మన్న
విశ్వ కల్యాణమున కిదే విమల పథము.
అర్థమే వల దనగ సన్యాసి గాము,
తర్కమే తగ దనగ ఛాందసుల గాము,
అభ్యుదయము పేక్షింప మే మంథులగుచు,
కాని సౌందర్య శివముల మానలేము.

సహృదయ హృదయ సుమ భూమి, శాంతి దాంతి
వృక్షముల నీడ, యానంద వేదికల, జ
గన్మనోహర మూర్తివై, కర్మ యోగ
మందు కొనుమయ్య. విశ్వ కళ్యాణమునకు.

ప్రేమింపుము నీ వారిని,
ప్రేమింపుము నీదు పనుల, ప్రేమింపుము నీ
భూమండల మన్నా! ని
ష్కామం బగు కర్మయోగ సారం బిదియే.

ఓం. శాంతిః శాంతిః

# ఆంధ్రభాష - అవ్యవస్థ

శ్రీ 'గాండీవి'

విజయనగరమునందలి 'కౌముదీపరిషత్తు' సెప్టెంబరు నెలలో జరుపు కొనిన రజతోత్సవ సందర్భమునఁ బై శీర్షికతో నుపన్యాసమీయఁబడినది. ఆ యుపన్యాసమునఁ బ్రధానస్థానము నాక్రమించిన విషయ మాంధ్రనిఘంటు పరామర్శము. ఆ యుపన్యాసకునితో నభిన్నుఁడ నగుటచేఁ దదుపన్యాసము నందలి నిఘంటు పరామర్శమును స్వీకరించి యీ వ్యాసమును బ్రకటించు చున్నాను. ఫలానుమేయ ప్రారంభులగు "రజతోత్సవ పంచిక" సంపాద కులు తదుపన్యాససారమును బ్రకటింపకున్నను "శ్రుతేపశబ్దేవోక్తేవా" అను నాథర్వణము చెప్పిన వ్యాప్తి స్మరణమున కవకాశము కల్పించి నందుకు మాత్రము శ్లాఘనీయులు.

భాషాదేవికి నిఘంటు వ్యాకరణములు రెండును రెండునేత్రముల వంటివి అవి పొరలుగ్రమ్మియుండఁగా నిటీవల వ్యాకరణ నేత్రము నిర్దుష్ట మైనది. ఆ చికిత్సకులు నిఘంటు లోపములను గూడ నాయాస్థలములలో వెల్లడించియున్నారు. శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారీ విషయమునఁ జాల వఱకుఁ గృషి చేసియున్నారు. ఇంకను లోపములు మిగిలియేయున్నవి. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు వంటి బృహన్నిఘంటువు సమగ్రమును నిర్దు ష్టమును నైనఁగాని భాషకు లోటుతీరదు. కావున భాషారాధనతత్పరత్వ మీ వ్యాస ప్రకటనమునకుఁ బ్రోత్సహించినది. నాకుఁ దోఁచిన లోపములలోఁ గొన్నింటి నిటఁ జూపుచున్నాను.

(I) అర్థపరామర్శము

(i) అసమగ్రార్థములు :—1 ఆకంపించు=మిక్కిలి కంపించు-అని మాత్రమే యర్థము చెప్పఁబడినది. కొంచెముకంపించు-అనునర్థము చెప్ప లేదు. ఈ యర్థమున 'అనోకహా కంపితపుష్పగంధీ' అని రఘుకారుఁడు ప్రయోగించెను. (రఘు 2-18) 'ఆకంపితాని ఈషత్కంపితాని' అని మల్లి నాథ వ్యాఖ్య 'ఆఙ్ సీమాయా మభివ్యాప్తౌ క్రియాయోగేషదర్థయోః' అని విశ్వకోశములో నీషదర్థము చెప్పఁబడియున్నది.

2 ఉరశ్ఛదము = కంచుకము - అనునర్థము వ్రాసిరి. ఇది సరియే కాని 'దయితోరశ్ఛద కోటిషుస్థితిమ్' (రఘు 8. 86) అను కాళిదాసు ప్రయోగమున నెడ నీయర్థము సరిపడదు. 'ఉరశ్ఛదోఽంశుక ఇతి కేచిత్' అని మల్లినాథవ్యాఖ్య. కంచుకమనునర్థము కేచిన్మతమని నిరసించినచో 'ఉరశ్ఛదాకుచౌ' అనునర్థమును నిరసావహింపక తప్పదు. 'ఉరశ్ఛదాఃకుచౌ వక్షోరుహౌ స్తన పయోధరౌ' అని ధనంజయనిఘంటువు. కాఁగా సూ. ని. కర్తల యర్థమెట్లును నసమగ్రమనక తప్పదు.

3 ఓ = ఒక - అనునర్థము చూపలేదు. 'ఓ రాత్రింగను చెప్పవేయక' (కాశీ 5-189) అను శ్రీనాథ ప్రయోగము దీనికిఁ బ్రమాణము.

4 కలభము = కరిశాబకము - అని వ్రాసిరి. కాని కరిశాబకమే కానక్కఱలేదు. శాబకము కూడఁగావచ్చునని 'ధవలకలభ కలాప్రోత్పుష్టకుసుమకేసర' (పాండు 1-131) అను తెనాలిరామకృష్ణుని ప్రయోగమునుబట్టి తెలియుచున్నది.

5 కోణపుఁడు = రాక్షసుఁడు. ఈయర్థము సూ. ని. లో లేదు. 'నైరృతుఁడు' అని మాత్రమే యున్నది. కోణప శబ్దమునకీ రెండర్థములును జూపఁబడెను. వాచస్పత్యాదులలో 'కోణప' శబ్దమే లేదు. కాని గురుబాల ప్రబోధికలో 'కౌణప' శబ్దపర్యాయముగానిది కలదు. 'గ్రుక్కలుపెట్టుదురు సురలు కోణపముఖ్యులి' అని 'కోణప' శబ్దమును శ్రీనాథుఁడు యతిస్థానమున రాక్షసార్థములో బ్రయోగించినాఁడు. (హర 6-124) "తిష్ఠ తిష్ఠ కోణపాపశద" (అభిజ్ఞా 6-28. పరువాతిగద్య) అని కాళిదాసప్రయోగము. 'కుణపాశన' అనుపాఠాంతరము త్యాజ్యముగఁదగును.

కోణపుఁడు = కోణపాలకుఁడు — అనఁగా నైరృతి యగునుగాని రాక్షసుఁడను నర్థమెట్లులభించునని నిఘంటుకర్తల యాశయము కావచ్చును. కాని 'కుణపభక్షణ శీలుఁడు' అని యర్థము చేసినచో 'కోణపుఁడు = రాక్షసుఁడు' కావచ్చును. 'కుణ' త్రి ధాతుః ం శరీరం శవో వాతం భక్షయితుం శీలమస్య' అని కోణపశబ్దమును రాక్షసపరముగాఁ సాధించుకొనవలయును. ఈ యర్థమును శ్రీనాథప్రయోగము స్థిరీకరించుచున్నదిగదా.

6 క్షపణము = విఱుచుట. 'స్మరాసన శరాసన క్షపణసారదోర్వ్యాంధురా' (వ. చ. 3.67) అనిరామరాజ భూషణ ప్రయోగము. ఉపవాసమును నిఘంటుకర్తల యర్థమిట పరిపడదు.

వీ యర్థ మున్నది. పదముల యర్థవివరణాయము కావ్యపరిశీలనము లేనిదే తెలియుటకు వీలు లేదు.

12. మకరము = చేఁప. శబ్దరత్నాకరములో నీయర్థము కలదు. సూ. ని. లో లేదు. "అతివచూపులు — — వరమకర నీలపద్మాది వైభవములు" (హ. వ. 4–45) అని బట్టుమూర్తి ప్రయోగించెను. వ్యాఖ్యాత 'మకరోమత్స్యరాడ్ఝష:' అను నిఘంటు సారవచనమును ప్రమాణముగాఁ జూపెను. "మకర: — — మత్స్యానాం మకర: శ్రేష్ఠో —— ఇతిహారీత:" అని హలాయుధకోశస్థ పదములకు వ్యాఖ్యాతలైన శ్రీ జయశంకర్ జోషి' గారుదహరించియున్నారు. మకరము = మత్స్యవిశేషము. అని వ్రాయఁదగును.

13. మరుత్ఫలము = వడగండ్లవాన — అని విలియమ్సు ననుసరించి సూ. ని. కర్తలు వ్రాసిరి. 'ఇంద్రధనస్సు' అను నర్థము వ్రాయవలసియున్నది. 'ఆటకు మెచ్చి బలారి యొఁగొను మరు, త్ఫలమిది యన బర్హిభారమమర' (పాండు 1–161) అని తెనాలిరామకృష్ణుఁడు ప్రయోగించెను. 'భవేద్వాయుఫలం శక్రకార్ముకే కరకేపిచ' అని విశ్వకోశము. ఇదే మరుత్ఫలమని ప్రయుక్తమైనది. "మరుత్ఫలమ్ = ఇంద్రధను:" సర్వశబ్దసంబోధిని.

14. మాయి = గారడివాఁడు — అని యర్థము వ్రాసిరి. 'మోసకాఁడు' అను నర్థను దీనికిఁ గలదు. "రూపహీనుఁడు మహాక్రోధనుఁ డతిలోభి, బద్ధమత్సరుఁడన్యబుద్ధి మాయి" (పాండు 4. 145) అని పాండురంగ కవి ప్రయోగము. ఇదేకాక పరమేశ్వరుఁడను నర్థమును దీనికిఁ గలదు. పూర్వోదాహృత హలాయుధకోశ వ్యాఖ్యాతలగు జయశంకర్ జోషిగారిట్లు వ్రాసియున్నారు. "మాయీ (న్) పుం. (మాయాస్త్యస్య. మాయా + వ్రీహ్యాదిభ్యశ్చ ఇతి ఇని) మాయాకార:; ధూర్త: ........; పరమేశ్వర: మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరమ్ — ఇతి పఞ్చదశ్యామ్"

15. పింగళ, పురుషాయుషము, మణిప్రవాళము మున్నగు పదములకు మంచి వివరణము సూ. ని. లోఁ జేయఁబడలేదు. విస్తరభీతిచే నీ ప్రకరణము నింతతో ముగించుచున్నాను.

**(ii) అపార్థములు :-**

అపార్థములును సూ. ని. లోఁ గలవనుటకు దిఙ్మాత్రిముగా నుదహరింతును.

1. మదిరాక్షి = మదముకప్పిన కన్నులు గల యాఁడుది, ఆఁడుది (శ. ర.) అని సూ. ని. లో నున్నది. "మదిర = ఒక దినుసు కాటుక పిట్ట" అని యర్థము వ్రాసి కూడ మదిరాక్షి శబ్దమునకు శబ్దరత్నాకరమే గతి యనుట శోచనీయము. "మదిరాక్షి...మదిరా మత్తఖంజనాక్షీవాక్షి యస్యాషచ్ సమా. ఖంజనతుల్య నేత్రేతి. స్త్రియాంఙీష్" అని వాచస్పత్యము. "మదిరా......మత్తఖంజనే ఇతి శబ్ద రత్నావళీ" అని వాచస్పత్య శబ్ద కల్పద్రుమములలోఁ గలదు. కాన మత్తఖంజన మను నర్థమున కేదో వింతనిఘంటువు మాత్రమే యాధారమని చెప్పి యీ యర్థమును నిరసించిన శ్రీ వేటూరి వారి ప్రామాదిక మనవలసి యున్నది. "మదిరా...మత్తఖంజనః యది మదిరా యత నయనాం...ఇతి శాకుంతలే" (హలాయుధకోశ వ్యాఖ్య) అనుచో జయశంకర్ జోషీగారు మత్తఖంజన నేత్రయను నర్థమునే గ్రహించినారు. ఈ యర్థమే పరిగ్రాహ్యమని చెప్పఁదగును.

2. ముష్టింపచుఁడు = దరిద్రుఁడు. శ. ర— అని సూ. ని. ఈ శబ్దము గాని నీవార ముష్టింపచుఁడన్నది గాని శబ్దార్థచింతామణ్యాదులలో లేకుండుట వింతగా నున్నది. విలియమ్సులో నిది సరిగానే యున్నది. కాని శ. ర. ననుసరించి సూ. ని. యిట్లర్థము చెప్పినది. ఈ శబ్దములోని ముష్టి బిచ్చమని భ్రమపడినారు కాఁబోలు. నీవారముష్టింపచుఁడు— అనుటకుఁ బ్రయోగములు— కాశీ 1-101, 4—204; భీమ 2—88, 12—152 మొ॥ "గుంద్రా డాచినఁ బెండ్లియేమిటికిఁ జిక్కెన్ గష్టముష్టింపచా" అని మనుచరిత్ర (మను 5—17) 'నీవారముష్టింపచుఁడు' సూ. ని. లో లేక కాఁబోలు తత్పండితులలో నొకఁడు భీమఖండములోని నీవారముష్టింపచుని నీహారముష్టింపచునిగాఁ జేసినాఁడు. ఆ ముని పాపము ! నీహారము తినలేక బాధపడు చుండఁగా నిటీవల దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు రతని నుద్ధరించినారు. (స్రవంతి. అగస్టు పత్రిక.)
"పరిమాణేపచః (సి. కౌ. కృదంత 2948)

లి యూథము = సమూహము, సజాతీయ సమూహము— అని యర్థము చెప్పవలెను. "యూథము = సజాతీయ పశుపక్షి సమూహము" అని సూ. ని. లోఁగలదు. శ. ర. లోఁగూడ నిట్లేయున్నది. "అసుర యూథంబుచేత దుర్గాద్రిదరికి" (హర 6-49) "విబుధ యూథంబు ప్రార్థింప వింధ్యశిఖరి" (పాండు 1-120) "విరోధి" యూథమథన క్రియాహేతు యుద్ధకేళి" (పాండు 3—174) నారదముఖమునినాథయూథంబు (పండితా. దీక్షా 85 పు) "ఉన్నచోతాన భక్తయూథంబుబంట" (పండితా, దీక్షా 138 పు) అను ప్రయోగములు వీని యర్థమును సమర్థించుచున్నవి. "యూథమ్ (1) సజాతీయజంతుసమూహః (2) బృందమాత్రమ్—" సర్వ శబ్దసంబోధిని. "యూథః - పుం. సజాతీయ సమూహః — — సమూహేం" శబ్దస్తోమమహానిధి.

(II) శబపరామర్శ :—

1. కప్పురగంధి. సూ. ని. ఉన్న 'కప్పురగంధి' తోపాటుగ నంగీకరించుటకు సిద్ధపడరాదు. 'ధ' వర్ణమును నిర్వహించు ప్రయోగము లేనప్పుడనాంధ్రవర్ణస్థితి ప్రామాదికమని సిద్ధము.

2. గ్రహయాళువు సూ. ని. లో గృహయాళువు మాత్రమే కలదు. శ. ర. లో గ్రహయాళువు మాత్రమే కలదు. శ. ర. వలెనే సూ. ని. చెప్పలేదు." ప్రసూ, నాపైవ గ్రహయాళువుల్ వాలకపడఁజారాఁడు మధ్యంబు నన్' (భీమ 5-94) "తర, తుకముబై గ్రహయాళు భల్లూకము" (మను 4-38) అను శ్రీనాథపెద్దనల ప్రయోగములు చూపట్టుచున్నవి. "స్పృహి గృహిపతి దయి నిద్రాతన్ద్రా శ్రద్ధాభ్య ఆలుచ్" (సి. కౌ. 3138) అని 'గృహి' ధాతువునకు 'ఆలుచ్' విధింపఁబడుటచే గృహయాళువు సాధువను టలో విప్రతిపత్తి లేదు. కాని శ్రీనాథపెద్దనల ప్రయోగములు ప్రామాదికములనరాదు. అవి యుపపాతములని సంస్కరింపఁబూనుటయు సరియని తోఁపదు. 'గృహి' ధాతువు 'గ్రహి' ధాతువునకు రూపాంతరమని చెప్పనగునని నాయభిప్రాయము. లేదా దీని నపాణినీయముగాఁ దలంపవలెను. సంస్కృతాంధ్ర మహాకవి ప్రయోగములెన్నియో యపాణినీయములు. అంతమాత్రమున నవియసాధువులు కానేరవు. (మా. చింతామణి విషయ పరిశోధనము) పణిహాపత్య పణినసూమశబ్దముల నపాణినీయములఁ బ్రయో

గించిన శ్రీనాథ పెద్దనలు 'గ్రహయాళువు' అను నపాణినీయ శబ్దమును ప్రయోగించిరనియుఁ జెప్పవచ్చును. కాన సూ. ని. కర్తలు గ్రహయాళువు నుపేక్షించుట సరికాదు.

3. తరుణియ- ఈ శబ్దమును 'తరుణియ యొక్కర్తు' (కు. సం. 8-68) అనునన్నెచోడుని ప్రయోగము 'తరుణియలొప్పనాడిరి' అను నన్నయ ప్రయోగమును నుదాహరించి సూ. ని. కర్తలంగీకరించిరి. ఈ పద్యము లందలి పాఠములు కవిప్రయుక్తములు కావని నాయభిప్రాయము. 'తరుణి మఱొక్కర్తు' నన్నెచోడుని పాఠము కానోపును. 'తరుణులునొప్పనాడిరి' అని బహూరి వ్రాత ప్రతిలోనున్నట్లు నిఘంటు కర్తలే వ్రాసిరి. కాననదియే గ్రాహ్యము. లేదా 'తరుణిమతొప్పనాడిరి' కవిపాఠము కావచ్చును. 'తరుణియ' త్యాజ్యము.

4. పుడమీశుఁడు. ఇట మిశ్రమను నిఘంటు వచనము సరికాదు. సోమనాథుఁడు వైరిపదమును బ్రయోగింపఁడు. కాన సిద్ధసమాసముగానే శ్రీవజ్ఝలవారు సాధించిరి. దీనితో నేకీభవింపకపోయినను శ్రీ నిడదవోలు వేంకటరావుగారు సోమనాథుఁడు వైరిపదము ప్రయోగింపడనుటతో నేకీభవించి మార్గాంతరము త్రొక్కిరి. కాని వారిమార్గముపరిశీలనమూలక మైనది. వారు ఘట్టకుటికా ప్రభాతన్యాయమున శ్రీ శాస్త్రిగారి యొద్దకు రాక తీరదు. ఈ పుడమీశుడు అనుదానికి మఱియొక రీతి సమర్థనము చెప్ప వచ్చునని నాతలంపు. సోమనాథుఁడు సమస్తపద తద్భవములు వాడుచుండును. కాన 'పృథివీశ' శబ్దభవముగ 'పుడమీసు' అంగీకరించి 'పుడమీస మీఁద నంబున కుఁజేసాప' అని ప్రయోగించి యుండవచ్చును. ఎట్లయినను సూ. ని. వ్రాఁత మాత్రను ప్రామాణికమనుటకు సందియములేదు.

5. యోచించు. యోచనా శబ్దము కానరాదనిచెప్పుచు 'వినియోచించి వినోదముల్ గనుట' అనుదుర్బల ప్రయోగము నూత గొనుట వింత. 'వినియోజించి' కవిపాఠమనుటలో శంకలేదు. 'యోచించు, నిర్మూలము.

6. పెండ్లిండ్లు- పెండ్లి శబ్దమునకిది బహువచనమని చెప్పి నిర్ధారక ప్రయోగములు లేవనిరి. ఇది తప్పురూపము. 'పెండిండ్లు' సాధువు 'పెండిండ్ల నోములబేరంటములను, బండుగు దినములఁబాటి జాతరల' (బసవ)

7. కొఱత- (కొఱ్ఱు+త) "విచార్యము" అన నక్క లేదు. (చూ. నిరం. 4-87.) పలన 'కొఱత' అను వ్యావహారిక రూపకమునకు

గ్రాంథికత్వము ప్రసాదింపఁ బడెనని గ్రహింపఁ దగును. మనుచరిత్రము నందలి 'కొఱత' ప్రయోగమును ధ్వనిలో నంతర్భవింపఁ జేయవలెనను తత్సమచంద్రిక ప్రామాదికము. అటరెండవ యర్థము వాచ్యమే యైనది.

(III) ఇతర లోపములు :- సంస్కృతాంధ్ర కావ్య ప్రయుక్తము లయిన వందలకొలఁది శబ్దములు సూ. ని. లో లేవు. కాన నిది యసమగ్ర మగుచున్నది. ప్రాసాది గత నిర్ణాయక ప్రయోగము లుండఁగా దుర్బల ప్రయోగములు చూపుట, ప్రాచీనతర ప్రయోగము లుండఁగా నర్వాచీన ప్రయోగము లుదాహరించుట, మహాకవి ప్రయోగము లుండఁగా సామాన్య కవి ప్రయోగము లిచ్చుట, ప్రయోగ ప్రదర్శనములోని లోపములు. కొన్ని శబ్దములకు వ్యవహారము, సంస్కృత కోశములలో నుండుట యాధారములుగాఁ జెప్పినారు. కాని వానికిఁ గావ్యములలోఁ బ్రయోగములు గన్పట్టుచున్నవి. ప్రయోగాన్వేషణము చాలలేదనుట కిది నిదర్శనము. తత్సమముల విషయమున వీరు చేసిన కృషి యత్యల్పము. హలంతముల తత్సమత్వ విషయము విచార్యమై యున్నది. ఇవియెల్లఁ బ్రత్యేక వ్యాసములలో నివేదింప వలసినవి. ఇట సూచనా మాత్రముగాఁ జెప్పఁబడెను.

"తప్పొప్పనుచు నొప్పుఁడప్పని, చెప్పకుడీ 'బుధులు, హస్తి
చేసెద మిమ్ముఁ"

కవిత :

# చాటువులు

-శ్రీ దుర్గానంద్

నన్ను నా ఊహ యెత్తుతో కొలువు గాని నా ఆకారం
ఎత్తుతో కొలువ వద్దనుట:

భువికంటెన్ గిరికంటె నే నడుగు చొప్పొం దక్కువై యుంటి కా
ని వియత్తున్ స్పృశియించు ఊహనికి నన్వేషించ నా యెత్తు నిం
కెవరున్ లేరు మదీయ మూహాకలితం బీవ్యోమ యాన ధ్వజం
బవలంఘించె సమస్త సృష్టిగత మయ్యానుత్రిత్ నముల్ శృంగముల్



జగత్తు నా బింబాన్ని తెలుసుకుంది గాని నన్ను తెలియలేదనుట:

అడుగులు గాంచు నా గృహ పుటంగణ మందున, బేరగాని యం
గడి బడియున్న రోజు జను ఖర్బుల నారయు చాకి యుంటమై
మడుపులు చూచు బేసి కొల మానముతో నను నూహసేయు వీ
టి ప్రజ నాదు బింబము నెఱిగెను నన్ను నెఱుంగ దింతకున్



నేను నిస్పృహోయున్నై ఎందుకు కూర్చున్నానో తెలియునా అనుట:

నా యానంపము నాకు ఛిన్నమగు సన్యపాత్రిణితో గూర్చి ర
థ్యా యానమ్మును లాగు ఘోటకము చందానన్ మదీయమ్ములన్
మాయా రజ్జున లాగుచుండ జడమై మార్గంబులో పిల్లై
గాయం బైన మనస్సుతో భువిదివుల్ కాంక్షించు చుంటిన్ ప్రభూ.



నన్ను నాలో కాక నాతో సంబంధమున్న వారిలో చూడమనుట:

నే నన నొక్క మృత్స్న కుదురే యనుకొంటివా నాకు నేను నె
వ్వానికి గాక యుంటినె। గవాక్షము కుడ్యములోన నట్లు నే
గాన రయమ్ము నా శ్రుతిని కట్టెనో నాకయి మోడ్పులే మహా
మానవ మేధతో తగుల మయ్యెనో అవ్వియు నేను కానొకో



విషయాలను ఇచ్చి వాటిని ఎందుకు దుష్ప్రాప్యాలు చేసినావనుట:
ఏ కొరగాని వాడ నన కీవు సృజింతివింత తెల్వితో
ఆ కమనీయ గానములు నందక వీనుల కింత దవ్వులో
ప్రాకి గ్రహింపలేను మరి ప్రాకెడు పాముల త్రోయలేను కూ
రాకు చెడందగోన గల దగ్గియె పొరగ కోర లేదుగా.

★

అస్తిత్వముల యొక్క శాశ్వతక్షణ భంగురత్వములే కాలములగుననుట:
ఆ సౌధంబున నిన్న యుంటిరెవరో అగ్గ్యోగదా! నేడునున్
వా సమ్మున్యుద్ది రేపు వారికిని గా వారుండు నస్తిత్వముల్
ప్రాసాద స్థితికంటె తగ్గి యవియే భావ్యాది కాలత్రయం
బై సార్థక్యమునొందె రేబవల పర్యాయాను మేయంబులై

★

క్రౌర్య మార్దవములు సహజ సంజాత గుణములు కావనుట:
ఏ పవడాల దీవులనొ పలుకులున్ గురి వెంద తీగెలున్
రాపిడి వడ్డ తిన్నెనొ కరంగెడి వెన్నెల వాక జేయపి
రూపు చెనంగి కోత వడి రూపు నగంబుల గ్రుచ్చి గ్రుచ్చియే
దో పులి రూపు ఎత్తినది తోరపు గోరుల రక్తిమాకృతిన్

★

శాస్త్రజ్ఞుడు పోవు తొందరలు అలస్యములగు ననుట:
ఈ పడ బోవు తొందర యదేమిటి యాత్రిక! వేగశక్తిపై
నీ పొనరించు చేష్టల గుణింతము లెమ్ము! మరొక్క గంటలో
చూపున కంద వాపయిన శూన్యములో బడి శేష ఘంటికల్
త్రేపుదు వూరకే బ్రతుకు తేరు ఠయంబొక చోట జాగగున్



గేయ నాటిక :

# అవిముక్తము

—శ్రీ యస్వీ జోగారావు

## పాత్రలు

కవికంకాళము, మనఃకాంత, సంధ్యాదేవి
భగ్నమైనకవి మనసు నుండి బయల్వెడలిన ఊహావిహంగము,
ఈహామృగము, స్వప్నాశ్వము,
ప్రణయదేవత, కవితాధ్వజము.

సమయము : సాయం సంధ్య

స్థలము : ఒక శ్మశానము— ఎండిన చెట్టునడుమ పాడుపడిన సమాధులు, అక్కడక్కడ సెగలూ, పొగలూ, మసక మసక చీకట్లలో మిణుగురుల విహారములు. నక్కలు, గుడ్లగూబలు, రాబందులు, కీచురాళ్లు, కంకాళములు, మొదలగువాని అరుపులూ, వికటాట్టహాసములు.

*　　　*　　　*

మనఃకాంత : (నేపథ్యము నుండి)
శ్మశానమున
హేమంత వసంతాలు సమానం
నిశావేళ
ఇరులూ మిణుగురులు సమానం

[ఈ పల్లవితో తెర జాలిగా తెరుచుకుంటుంది. ఎదురుగావున్న ఒక సమాధి వెనుకనుట్టున కవికంకాళంలేచి ఆడుతుంది.]

సూచన : (ఈ ఊహావిహంగాదులను బాలబాలికలచే ఉత్తసాంకేతిక ప్రతిపత్తితో ప్రదర్శింప జేయవచ్చును. అంటే ఊహావేషమునకు రెక్కలు, ఈహాకు వేడికొమ్ములు, స్వప్నమునకు గ్రామదేవత జాతరలలో నుపయోగించబడు మనుష్యులు లోపలదూరి ఉపరిభాగము మనుష్యుడు, క్రిందిభాగము గుఱ్ఱమువలె

కన్పించుచున్న కుడ్యము మెఱు నాదిని వాడవచ్చును. లేదా కరాళములను (masks) ఉపయోగింపవచ్చును. ప్రణయదేవత కేవలమొక బాలిక వేషము. కవితాధ్వజమును గూడ ఒక బాలికచే భుజములకు, తలకు రంగు రంగుల అందాలుకట్టి ప్రదర్శింప జేయవచ్చును.)

సంధ్యాదేవి : (ప్రవేశించి)

పాడుదేహం పది పదేడులు
బ్రతికి నందుకు ప్రయోజనం ?
కాలేదా ప్రియుకాంతామణి
కౌగిటిలో సుఖభాజనం !
పాడు కన్నులు చూడలేదా
శతశాత సుందరరూపం !
పాడు గొంతుక పాడ లేదా
ప్రణయమయ గీతకలాపం !
పాడు పెదవులు త్రాగలేదా
మధురాధర మరందరసం !
పాడు మనసు తృప్తి పడలేదీ
శతాబ్దాల బ్రతుకులో
ఒక క్షణం !

మనఃకాంత : (నేపథ్యము నుండి) సంధ్యా! సంధ్యా (అని పిలచును)

సంధ్య : (నిష్క్రమించును)

కవికంకాళము : (పాట అవుతున్నంతసేపూ విరపిరలు పోతుంది. అయి పోగానే రంగంముందుకు వచ్చి అభిముఖంగా)

మనసుచచ్చి జీవచ్ఛవముగ
మనుగడ మరిచేత గాక
మరణించితి నిది నాసమాధి.
మడియక నామనసు నెరపు
సమాధికడ సామ్రాజ్యము.

(అని అక్కడ రాలిపడిన ఒక ఆకుతీసి, ఒక ఎండిన మోడున నున్న కట్టెపుల్ల విరిచి సమాధి వేదికపై చదికిలబడి ఏదో

(పాత్ర నభినయించును. ఏదో గీతము వ్రాసి చదువ బోవు నట్లు లేచి)

నా పగటికలల ప్రియురాలొకనాటి రాత్రి
నా కలలో చనిపోయెను
నా ఊహాల ఊయెల నుఱ్ఱాత లూగు
హృదయేశ్వరి కలలో కనుమొరగెను
ఊహాస్వప్న గుంహానములలో
ఉక్కిరి బిక్కిరైనది మనస్సు

ఊహా మనుగడ కూహాస్వప్నము
లీవలావలి యవధులైనవి
భావితాంతఃకరణ జీవాత్మకు
జననమూహాము మరణము స్వప్నము

కలలో కలసి మెలసి యిరువురము
ముఖాముఖి నేకశయ్యా సుఖోపవిష్టులము
అపదతీత మధురానుభవో పక్రమ
రమణీయ సుముహూర్త సుముఖులము
కౌతూహల దోహలము
కలయైనా కడముట్టక
నట్టనడుమ పట్టువదలె
అలచెలరేగి సాగరపుటంచున
విరిగి సుళ్లుతిరిగి విరిగిపోయె
గగనంలో గాలిపటం
దారంతెగి దూరముగా పయనించెను
చక్కనియొక నాటకమున
చరమాంకము జరుగుచుండ
చరచర తెరజారిపడెను
ఉవ్వెత్తుగ లేచినయొక
ఉజ్జ్వలాగ్ని జ్వాల
హఠాత్తుగా దిగజారి ఆరిపోయెను
ఊహావిహంగోడ్డీన ప్రదీప

గరుచ్చాలన మరుప్రసారములో
ఈహా మృగవల్గగతి ప్రతిధ్వనులకు
వచ్చిన మెలకువ-
అది మెలకువ కాదు
చివరి నిదుర చింతనలో
కన విప్పిన జీవిత స్వప్నము
ఆ మెలకువలో
కరగిన కలకు ఫలశ్రుతిగా
అంతరాళ మాలాపించిన
శోకగీతిక
సుప్తాను భవస్మృతి ప్రతీక
యోగీతిక

మనఃకాంత : (సమాధివెనుక తట్టునుండి ప్రవేశించి
కవికి కనీకనిపించనట్లు మసులుతూ)

రెక్కలుంటె నాకు రివ్వు రివ్వున యెగిరి
దిక్కుదిక్కులనున్న దివ్యసౌందర్యమ్ము
నొక్కత్రుటిలో చూచి చక్కవస్తాను.
పూవు పూవును చూచి పొంగిపోతాను
రేకు రేకున సొగసు రేఖ చూస్తాను
పూవులన్నీ రాలి పోవునా యేని
దేవుడిని నిలదీసి పృచ్ఛ చేస్తాను
చెట్టు చెట్టున తోటి పిట్టలను పిలిచి
గుంటిబయటను పెద్ద గుడికట్టుతాను
గుడిలోన దేవుడిని కూర్చుండబెట్టి
గుట్టుగా మాగుండె గోడు చెబుతాను.

కవి : (ఆపాట వినినవానివలె)
ఎన్ని జన్మల సంస్కార
బలము కారణమొ
సన్నిహితంబీ జన్మకు
సాహిత్యమువా యెదకు

మనఃకాంత : కలకంటూ చనిపోయిన
కవిశేఖర
చచ్చిన వానికి సాహిత్యములా ?

కవి : సత్యము సత్యము సాహిత్యములో
కలలు ఫలించును
కలలో కనిపించిన నా మనసున
వికసించెను సాహిత్యము
నా బ్రదుకే భగవంతుని కల
నా మనసే దయాని కవిత

మనఃకాంత : శ్మశానమున
హేమంత వసంతాలు సమానం
నిశా వేళ
ఇరులూ మిణుగురులు సమానం
చిదికి చిదికి ఛిద్రుపలై
ఎదలే సొగగుందు వేళ
ఎందుకులే నిట్టూర్పులు
నిడుద నిడుద నిట్టూర్పులు !
కలలూ ఊహలు కాంతులు
విల విల విల లాడు వేళ
ఎందులకే తూలికలు
కళాకాళి నాలికలు !

కవి : మనసు చచ్చి జీవచ్ఛవముగ
మనుగడ మరిచేతకాక
మరణించితినిది నా సమాధి
మరణించితిగాని నేను
మడియక నా మనసు నెరపు
సమాధికడ సామ్రాజ్యము
ఆకులలో తలిరులలో అలరులలో
ఆమని కోయిల గొంతుకలో

వసంత వనస్వాంతములో
వసించి పరవశించి తను
పరిహసించునను
నా మనసే నను పరిహసించు
నను నేనే కనికరింతు.

నే పథ్యమున ఏదో బద్దలై పోయినట్లు పెద్ద చప్పుడు-మనఃకాంత నేల వ్రాలును ఆమె పడిపోయిన చోటునుండి విస్ఫులింగములు కొన్ని అటు నిటు వ్యాపించును.

సంధ్య : (విసురుగ ప్రవేశించి కవితో)
పంచభూత సంచితమ్ము నీదేహము
పటాపంచలై పోయెను
పంచభూతములగలసెన్
నినువంచించిన నీమనసే
తునాతునకలై పోయెను
పంచభూతముల మీదను
పగబట్టిన పగిదితాను
పంచాకృతు లవధరించె.

అదిగో నీ దైనయూహ
విహరించును విహంగముగ

(ఊహావిహంగము లోపలినుంచి పరుగునవచ్చి నేలవ్రాలినట్లొక్కపరి రంగముపై కిరాగానే కూర్చుండి లేచును.)

అదిగో నీదైనయూహ
లేడివోలె క్రేళ్లురుకును.
(ఊహామృగము చెంగులువేయుచు ప్రవేశించును)
అదిగోనీదగు స్వప్నము
హయమువోలె కదనుత్రొక్కు
(స్వప్నాశ్వము కదనుత్రొక్కుచు ప్రవేశించును)
అదిగోనీదగు ప్రణయము
దేవతవలె దిగివచ్చెను

(ప్రణయదేవత పటాక్షేపముతో ప్రవేశించును)

అదిగో నీయనుగు కవిత

జగతినిండు నీకీర్తికి

జెండావలె నెగురుచుండె

(కవితాధ్వజము ఎగురుచు ప్రవేశించును)

కవి : ఎవరుమీరు ?

ఎందులకిటు వచ్చినారు ?

నా జీవిత నవ వసంత

వనవాటిక కేొచ్చినారు ?

బృందగానము : శ్మశానమున

హేమంత వసంతాలు సమానం

నిశావేళ

ఇరులూ మిణుగురులు సమానం

కవి : మనసుచచ్చి

మరియొక అవతార మెత్తి

చచ్చిన నాపై సాధించెను పగ

భగవంతుండగు భర్గుని మీదను

పగసాధించిన పంచాస్త్రునివలె

సంధ్య : తల నరసిన తనువొరసిన

వయసు మళ్లని మనసా !

ఊహా మృగము : అభినవ యౌవన భావనలో

ప్రణయానుభవ ప్రస్తావనలో

ప్రణయదేవత : విరహాగ్ని మహీధ్రశృంగాల్లో శృంగారధునీ తరంగాల్లో

ఊహావిహంగము : ఆశావిహాయసవీథుల్లో

స్వప్నాశ్వము : అగాధ స్వప్నసమాధుల్లో

సంధ్య : ముసలి ముసలి విసుగెత్తిన మనసా !

నిసర్గములు నీకోర్కెలు

విసర్గములు కావుసుమా

మనసా ! కొనసాగను బోవుసుమా !

అందరు : మనసా ! కొనసాగను బోవుసుమా !

బృందగానము : శ్మశానమున
హేమంతవసంతాలు సమానం
నిశావేళ
ఇరులూమిణుగురులు సమానం
చిదికి చిద్రుపలై
ఎదలే సొదగుందువేళ
ఎందుకులే నిట్టూర్పులు
నిడుద నిడుద నిట్టూర్పులు !
కలలూ ఊహాలు కాంతులు
విలవిల విల లాడువేళ
ఎందులకీ తూలికలూ
కళాకాళి నాలికలూ ?

(అందరూ అతనిని గేలిచేసినట్లు కవికంకాళం చుట్టూ గెంతుతూ పాడి అంతర్ధానమగుదురు)

కవి : (ఆసనమువంక చూపునిగిడ్చి)
నామనసొక కోమలామ్లాన
తామరస కోరకము
నిరంత రోదితాశా
మకరందతుందిలము

సారసగర్భస్థవిర భ్రమరా !
బ్రహ్మాండ భాండోదరా !
నిఖిలప్రపంచ నిర్మాతా !
నీకిదే నమోవాకము !

నాదేహము
పార్థివలింగము పద్మము
అంగజశక్తి శాతశాణోపల •
మాలింగిత సకలేంద్రియసారంగము
సర్వభూత సంసారము

అష్టమూర్తి భూతపతీ
నీకివే సాష్టాంగము
(అనిసమూధివైపు సాష్టాంగపడును)

**సంధ్యాదేవి :** (నేపథ్యమున)
మరణించిన మాత్రమ్మున
కడతేరదు జీవి బ్రతుకు
కానదు మోక్షము జీవుడు
మనోలయము జీవితచరమావధి
మనోలయ మపవర్గమార్గ చరమావధి

(జాలిగా తెరపడును)



వ్యాసము:

# ఆముక్త మాల్యద

— శ్రీ పప్పూరి రామాచార్యులు

## రాజనీతి

(గత సంచిక తరువాయి)

తన క్షేమమును కోరు రాజు తనకు హితులు, వివిధ శాస్త్రవిదులు, ధర్మరతులు, శూరులు, కులక్రమాగతముగా ప్రభుసేవ యందు నియుక్తులై వచ్చువారు నైనట్టి బ్రాహ్మణులను దుర్గములందు నిలుపవలెను. పులిజున్ను వంటి అపూర్వ వస్తువులతో గూడ నూరేండ్లకైన చాలినంత పుష్కలముగా ఆ దుర్గములందు సవరణలు పొందుపరుపవలెను. చీమంతయైన పొచ్చు తగ్గులు లేనట్లు పేదసామంతులకు భూమి నియ్యవలెను. ప్రజలకు నొప్పి కలుగని రీతిగా ఆయ మధికము, వ్యయము తక్కువ అగునట్లు కోశమును నింపవలెను. క్షీణదశ జెందు నృపుని చారదృష్టిచే కనిపెట్టి ఒకరీతిగా వాని భూమిని హఠాత్తుగా గ్రహింపవలెను. తాను గాని తన ప్రజగాని నొవ్వనట్లు శత్రువులను కాకుపరచవలెను. అట్టి నరపాలుడు రెండాన చేయినిడుకొని సుఖ నిద్ర సేయగలడు.

గజఘోటములను కొనుటకును, వానిని చక్కగా పోషించుటకును, సుభట జీవితములకును, ద్విజసురపూజలకును, ఉత్కృష్టములగు నిజభోగ ములకును చేయు వ్యయమును వ్యయ మనిపించుకొనదు.

'ఫలానా' శత్రువును జయించి తీరెదనువంటి ప్రతిజ్ఞలను రాజు చేయరాదు. దండువెడలి యుద్ధము సాగునప్పుడు కార్యము తీరుటయు తీర కుండుటయు గలదు. జయము కలుగనట్లు యుండి కాలాంతరమున నగును. నృపుడు కార్యపరుడుగావలెనే గాని కలహప్రియుడుగా రాదు.

శత్రుసైన్యము పారిపోవుటకు మార్గము లేకుండ చుట్టుముట్టిన యెడల వారు తిరుగబడి తెగించిపోరినప్పుడు జయమైన కలుగును, లేదా వీరస్వర్గమైన కలుగును. అట్టి సమయములందును, బహువిధమారక యంత్ర ములు గల కోటను ప్రాకారమును పట్టుకొనగోరినప్పుడును పార్థివుడు తన దండునే కవయింపవగును గానీ, తానే సాహసమునకు బూనవనదు.

ఒకటి రెండు రహస్యాలోచనలను సరిపోవునట్లు చెప్పెడు వానిని రాజులు పలుమారు పిలువనంపెదరు. ఆ చనువును ఉపయోగించుకొని వాడు ఇతరులతో లంచములు దీసుకొని క్రొవ్వి సంగతి కానివి చెప్పును. అట్టివారి బయటి వృత్తములను రాజు చారులచే విచారించి తెలిసికోవలెను.

తన ఎల్ల కవతలి రాజు చెడగలవాడేని తానే వానిని చెఱచుట మంచిది. చెడనివాడాయెనా వానితో చెలిమి మంచిది. వాని కవతలి సీమ గల రాజు వీనికి శత్రువయ్యెనా వాడే వీనిని చెఱచును. తన రాజ్యమునకు ఆపద యుండదు.

శత్రు రాజ్యమును బాధించుము, దుర్గముల పట్టుకొనుము. కాని వానిరాణులు చిక్కిరా వారికి పుట్టింటి మర్యాద జరుపుము. ఆ రాజుల రాయబారుల ఎదుట వారిని గురించి పరుషము లాడకుము. ఒకవేళ సంధి జరుగవలసి యుండునేమో ? వారిని తిరస్కరించి కఠినముగా మాటాడినచో సంధి అగుట కష్టము గదా ?

మంత్రతంత్రముల చేత మారణ క్రియలు చేయువా రున్నట్టియు, విష జలములుగలట్టియు, వ్యాధి బహుళమైనట్టియు, మర్గ మార ణ్యా ము లు పర్వతములు కలిగి కీకట జనసేవితమైనట్టియు దేశములో మేరుపర్వతము వంటి ధనము లభింపనున్నను ప్రవేశింపకుము. ఆ దేశమును పట్టుకొనుటకు నీ సేనలో కొంతభాగము మాత్రము పంపుము.

కపటియైన మనుజుడు రాజు నెదుట రాణింపబల్కును. జాణతన ముతో తన పనిని సాధించుకొనును. రాజు సంతోషముగా నున్న సమయము లలో అతనిని సేవించును. అతని బలము తక్కిచిక్కినప్పుడు తొలగి పోవును. నాణ్యముల మంచి చెడుగులను గుర్తించు కోమటి వలె రాజు అట్టి వారి నెఱిగియుండవలెను.

నరపాలుడు సాంగరాజ్యము నొక ఎత్తుగను స్వాంగరాజ్యము నొక ఎత్తుగను అనగా తన రాజ్యమును తన దేహమును సమానదృష్టితో రక్షించుకొని ఆయుస్సంపదను వృద్ధి పొందించు కోవలెను. నీతిశాస్త్రకోవిదులను చేర్చుకొని సువర్ణలోపాది గను లెచ్చట నున్నవో కనిపెట్టి, ప్రజల నుండి వారి యోగ్యత కనుగుణమగు పన్నులను స్వీకరించి మించినవారిని మర్దించి సన్నజేసి, స్నేహార్ద్రత చేత ఎల్లవారిని పోషించి ప్రజలను దుష్ప్రవర్తనములుడిపి పండిత బ్రాహ్మణులను సత్క

రించి బలియించవలసిన ప్రదేశములను ఎక్కువ జనము చేర్చి బలియించి పలుచపరచవలసిన పట్టును పలుచపరచి తన దేశమును నిష్కంటకముగా నొనర్చుకొని పరాక్రమించి సాంగరాజ్యమును రక్షించుకోవలెను. ఆ విధము గానే వైద్యులను చేర్చుకొని, ధాతువులెఱిగికొని, స్వర్ణభస్మాదుల సేవించి, దేహ ప్రకృతి కనుగుణమగు ఆహారములను స్వీకరించుచు, శరీరమర్దన చేత వాతప్రకోపమును క్షీణింప చేసికొని, అభ్యంగను చేత సకల శరీరావయ ములను పోషించుకొనుచు, ఒదలినరలను వస్త్రులను చక్కబరచుకొని దంత ముల పటిష్ఠతను కాపాడుకొనుచు పుష్టి నొందించవలసిన దేహావయవములను పుష్టి నొందించి, కృశింపజేయవలసిన అవయవములను కృశింపజేసి దేహదీప్తి యొప్పగా శోధన మొనర్చి స్వాంగరాజ్యమును కాపాడుకోదగును.

ప్రభువు దినచర్య ఈ రీతిగా నుండవలెను :— ప్రాతఃకాలమున సుఖ నిద్రను, ప్రశంసించువారు వైద్యులు జ్యోతిష్యులతోడి సమాగమము, జామ తర్వాత అమాత్యసామంత పూర్వకముగా అర్థార్జనలను తెలియజెప్పు కాయ స్థులతోడి మంతనము, దినమధ్యమున అంగమర్దన చేయువారితోడి మల్లు లతోడి దేహపరిశ్రమ, తర్వాత వంటలు వండువారు వేటాడి మృగముల తెచ్చువారితో సంభాషణ, అపరాహ్ణమున దేవపూజానంతరము ఆర్యులు ధర్మాధికారులు యతులతోడి గోష్ఠి, పిమ్మట భోజనము, తర్వాత విదూషక పురాణ కవి సాంగత్యము, సంధ్యాకాలమున వేగులవారితోడి సంభాషణము సంగీతసభ, నిశియందుటతో కాంతాలాపము, తర్వాత సుఖనిద్ర. వైద్యులు జ్యోతిషికులు, పండితులు, కవులు పురోహితులు రాజున కెల్లప్పుడును హితులు. ధనార్జనాది కార్యములందు నియుక్తులైన ఉద్యోగులు స్వప్రయోజనము వాంఛించి హితులు నహితులు నగుదురు. తప్పుచేసి దండనకుగాను తమధన మును రాజున కర్పించి తిరుగ దానిని రాబట్టుకొన గోరువారు సర్వదా అహితులు. ఇట్టివారి ప్రవృత్తిని గుర్తించి చరించుట రాజునకు నీతి.

సత్కారమున కర్హుడైన వానికి వాడడుగకయే, వానికి చెప్పకనే వాని ఊహకు మించినట్లు రాజు తానై తానే పనసపండ్లు దిగిన విరివిని స్వప్న మున కన్నరీతిని బహుమానముల నీయ్యదగును.

దేవకార్యములకంటె పితృక్రియలే కర్తవ్యములుగావున శ్రుతి శీల తపశ్శాంతులగు అచ్యుత భక్తులకు శ్రాద్ధదేయము నిచ్చి పితరులకు ఉత్తమ గతులు కల్పింప వలెను.

దానము ద్విజరక్షణమునకును, జ్ఞానము నిజరక్షణకు కావలెను. రాజ్యాంతే నరకం ధ్రువమనుటను నారాయణశరణాగతిచే తప్పించుకొనుము.

ఆలు పతి భక్తి కలిగి మెలగుట, స్త్రీ పురుషులు వావి తప్పక వర్తించుట, యతి ఇంద్రియ నిగ్రహము కలిగియుండుట, దిగు జాతులగ్ర జాతుల ననుసరించుట, దొరకు భృత్యు డొదిగి యుండుట, ఇన్నియు రాజదండన భయమువలననే సుమా!

వధ్యులగువారిని చంపు ధార్మికుడు, భార్యతో ఋతుకాలమున మాత్రము ప్రవర్తించు బ్రహ్మచారి, ఘాతహీనముగా బొంకు సత్యశాలి, ఎడనెడ కుడువక లెంచు ప్రాణులతో గుడిచి సదుపవాసి, పెద్దలమీద నడువక ఒదిగి తిరుగుడు, సత్కార్యములకు వెచ్చించు ధనియు పవిత్ర సరణి నగుదురు.

వేగులవాడు రాజధాని నగరమున నివసించువాడుగా నుండవలెను. అనేక వేష భాషావిదుడుగావలెను. ఇతర వేగులయునికిని వాడెఱుగరాదు. తన్నితరులు పోల్చుకో వీలైన గుర్తులు వాని కుండరాదు. కోరినంత ధనమిచ్చినగాని అట్టివాడు కొలువున కొప్పుకొనడు కావున ఎంత జీతమునైన నిచ్చి ప్రభువు అట్టివాని సేవగొనవలెను.

ఆ యా ఋతువులకు యోగ్యమైన మజ్జన భోజన లేపన వసనాదులు అనుభవించవలెనే గాని పుణ్యమార్జించు కొఱకు వ్రతోపవాసములుచేసి శరీరమును కృశింప జేయరాదు. వివిధములగు దానములచేతనే అతడు సుకృతము నార్జింపదగును.

రాజభోజనము పరిమళములతో గూడి గురు పదార్థములతో నొప్పుచుండును. కావున నరపాలుడు అపరాహ్ణమున ఆమ పక్వకోశ శుద్ధిచెంది ఆకలి వేసినప్పుడే భుజింపవలెను. ఆకలి లేక రుచికోసము భుజించుటవలన రోగములు కలుగును.

ధర్మార్థకామములను మూడు పురుషార్థముల యందును నృపుడు సమదృష్టికలవాడుగా నుండవలెను. ఒకవేళ ధర్మాంగమే హెచ్చినను లాభమే యగును చేనికి పెట్టిన నీరు హెచ్చయి గనిమ తెగి రాచనపు వరిమడికి పారినచో సంతోషకారణమే యగును గదా!

రాజు ఉజ్జ్వలుడుగా కొలువున ప్రకాశించుటకు దినదినమును తన మణి భూషణములను మార్చుచుండవలెను. కాని శ్రేయః ప్రదమై వెలుగొందు మంచిరత్నము నొక్కటిని నిత్యమును దాల్పదగును.

చేయునది రాజ్యము కావున పాపము తప్పదని ఆ పాపము ఎన్నటికినీ తీరదనీ రాజు నిరాశ జెందరాదు. అధర్మమునకు వశుడుగాక శక్తికొలది ధర్మపరిపాలన సాగింపవలెను. వేదశాస్త్రములు అనుష్ఠింప శక్యముకాని వానిని విధింపవు శక్తికి లోబడిన వానినే చేయజెప్పును.

దేవద్రుహుండగు మూర్ధాభిషిక్తుడు నోకోర్చి ఇలకుగల అలజళ్ళు తీర్చినంగాని జన్మంబు సఫలంబుగాదు. ఇంద్రియవశులై పరకళత్రముల బంధించి బాటసారులదోచి ధనముగడించు దొంగదొరలు రాజులనిపించుకొనరు. తొల్లి మహాబల సంపన్నులగు కార్తవీర్యాదుల వైభవ మహాత్మ్యము లిప్పటిరాజులకు లేని మాటవాస్తవము. ఒక విషయమున నేగాదు. ఇక్కాలంబునందలి విప్రులకు అక్కాలమందలి భూమి దివిజులకుగల శక్తియున్నదా? లేదని నేటి భూసురులు శక్త్యనుష్ఠానంబు విడువవచ్చునా?

కావున సావధానులవై శక్తికొలది శ్రుతదృష్టంబు లుపేక్షింపక రక్షణశిక్షణంబు లాచరించుచు అశక్యంబులకు ఆర్తశరణాగత రక్షకుండగు పుండరీకాక్షుమీద భారం విడి అనహంకృతి బ్రవర్తిల్ల నెల్లసంసిద్ధులు కరస్థంబులగు.

సమానులందు ఉత్తమశ్లోకుండవై రాజ్యపరిపాలనంబు చేయుమని యామున సార్వభౌముడు తన కుమారునభిషిక్తుం జేసె.

అని నిజభక్తుని వృత్తాంతమును అంబుజాక్షుడు అంబుజాలయకు ఆనతిచ్చె.

కవిత :

# సౌర మందాకిని

మూలం :
రవీంద్రుడు

అనువాదం:
—శ్రీ బి. వి. సింగరాచార్య

అహో కాంతి! ఓహో కాంతి!
విశ్వపరివ్యాప్త కాంతి!
చక్షుః ప్రియ చారు కాంతి!
మనోహారి మధుర కాంతి!

నా జీవన కుటి ముంగిట
నర్తన మొనరించు కాంతి!
ప్రణయ వీణ మంజు మధుర
రాగ మ్మొనికించు కాంతి!

విరిసె వియత్తలము, విజృం
భించి వీచె ప్రభంజనము
పృథివీ వదనమున నివత
శించె విపుల దరహాసము

లేపె కాంతి శరధిని తెర
చాప సీతాకోక చిలుక
వెలుగు టలల కోకొల్లలు
మొలిచె మల్లియలు మొల్లలు

జలదాంచలముల బంగరు
జలతారు హొరంగు లంది
అగణిత మాణిక్య వృష్టి
నవఘటించు శబల కాంతి!

ఆకాశాన చంగలించు
నమిత చిదానంద కాంతి!
పొంగి జగతి ముందు సౌర
గంగా మృత భంగ కాంతి!

అహో కాంతి! ఓహో కాంతి!
విశ్వపరివ్యాప్త కాంతి!
చక్షుః ప్రియ చాయ కాంతి!
మనోహారి మధుర కాంతి!

---

గ్రంథస్వీకారం :—

వ్యాసవాణి (2వ : భాగం) ... శ్రీ జాస్తి వేంకట నరసయ్య
సూఫీసూక్తులు ... తెలుగుసేత :- శ్రీ షేక్ దావూద్
రామమల్లు కన్నయ్య- సన్మాన సంచిక } భారతీ సమితి ప్రచురణ
గురుదక్షిణ ... ,,
మన శరీరనిర్మాణం ... మూలం :- జెర్ట్రామారిస్ పార్కర్
ఎం. ఎలిజబెత్ డేనింగ్
అనువాదం :- శ్రీ అద్దేపల్లి వివేకానందాదేవి
ఆర్యక థామాల ... సంకలనం :- శ్రీ కె. చంద్రశేఖరన్
అనువాదం :- శ్రీ రెంటాల గోపాలకృష్ణ
శత పత్రము ... శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి
బంగారిమామపాటలు ... శ్రీ కొనకళ్ల వెంకటరత్నం
అమరుకము ... శ్రీ శంకర ప్రసాద్
తులసీదాస హృదయము ... శ్రీ బందా రామయ్య
ప్రాచ్యారబులకు మిత్రదేశం- సోవియట్ దేశం } సోవియట్ భూమి ప్రచురణ
కౌముదీ పరిషత్తు రజతోత్సవసంచిక.

వ్యాసం:

# వియోగీహోగా పహిలా కవి

—శ్రీ వాసా సుబ్రహ్మణ్యశాస్త్రి

పంత్ యొక్క ఈ భావోద్గారం ఒక మహార్థభరితమైన సాహిత్య సూత్రం. వియోగదుఃఖితుడు ఆదికవి ఔతాడు. కవితోద్యమమే దుఃఖాశ్రువులనుండి ఉద్భవించింది అని దీని అర్థం. నిజమే, భారతీయ సారస్వతంలో ఆదికవిత వియోగావేశంలోనే అవతరించింది. వాల్మీకి స్వయం వియోగి కాడు, కాని క్రౌంచవియోగం యొక్క సమవేదనచే భావితాంతఃకరణుడు. ఈతని దుఃఖార్ద్రహృదయంనుండి ఆకస్మికంగా కవితాధార జారలివచ్చింది. ఆ ఆదిమ శ్లోకం విన్నప్పుడు బ్రహ్మ 'ఆద్యః కవిరసి, తద్బ్రూహి రామచరితం' ఆదికవి వయ్యావు, రామచరితాన్ని కావ్యంగా వినిపించు' అన్నాడట. ఈ ప్రేరణ గైకొని వాల్మీకి దుఃఖతంతువులు పడుగుపేకలుగా జేసి కావ్యవస్త్రం నేశాడు. భవభూతి అన్నాడు 'ఏకోరసః కరుణఏవ' అని. దాని అర్థ మిది, కరుణ ఒక్కటే మూలభూతమైన రసం. తక్కిన రసాలు దీని రూపాంతరాలు, ఉపాధిభేదంచే భిన్నములు. కరుణలో హృద్గతభావములు తెరలుతీసి. మరుగు లేక వెలికి వస్తవి. దుఃఖంలో భావం నగ్నంగా, నిసర్గమధురంగా భాసిస్తుంది. సహృదయునిలో చిత్తవిద్రుతి కల్గించడం రసకార్యం. ఈ చిత్తవిద్రుతి రసకార్యం అన్నప్పుడు అది కరుణవల్ల కల్గినంతగా మరిదేనివల్లా కలుగనేరదు. కరుణహృదయాన్ని జాలనజేసి ప్రసన్నంచేస్తుంది. కరుణలో సమవేదనకల్గి యెద మెత్తనౌతుంది. 'యెద మెత్తనౌటకై సోవగుందరా' అన్నాడు బసవరాజు అప్పారాయకవి. 'థామస్ గ్రే' కన్నీటి పొరలనుండి జీవితాన్ని చూడడం నేర్చుకున్నానన్నాడు. కరుణవల్లకలిగే సంస్కారమమేయము, అపారము. ఒకేనీరు, అల, సుడి, బుడగవంటి వివిధ రూపాల నెట్లు ధరిస్తుందో అట్లే ఒకే కరుణ, శృంగార, వీరాది వివర్తాలను పొందుతుంది. కరుణకు స్థాయీభావంశోకం. ఇష్టజన వియోగం వల్ల కలిగేదుఃఖమే శోకం. ఈశోకమే చిత్తవిద్రుతిని కల్గిస్తుంది. ఆదిలో కరుణలోనుండిన యీ చిత్తవిద్రుతిని కల్గించే శక్తి క్రమంగా, గౌణంగా తక్కిన రసాలలోకి సంక్రమిస్తుంది. అంతేకరుణ ఆదిమరసం. దానిరూపాంతరాలు అన్యరసాలు అన్నమాట.

మానవుని శోకం కదలించినంతగా మరేదీ కదలించలేదు. శోకంలో సామాన్యుడు దుఃఖిస్తాడు, రోదిస్తాడు. కవి భావశాలి, ప్రభావశాలి అవడంచేత దానిని భావపథంలో కవిత్వంలోకి రూపాంతరం చెందిస్తాడు. శోకంలో కవివాణి శోధితమై సూటిగా దూసుకొని వస్తుంది. ఆ భావాలకు, ఆ రచనలకు ఒక వేగం, ఒక అపురూపపులావణ్యం వస్తుంది. అప్పట్లో కవులు దుఃఖ హాలాహలాన్ని దిగమ్రింగి, నీలకంఠులై మనకు అమృతమాధుర్యాన్ని పంచిపెట్టారు. షెల్లీ అన్నాడు 'our sweetest songs are those that tell of saddest thoughts' అని ఈ మహత్వాన్నే మనస్సులో పెట్టుకొని 'వియోగీహోగా పహిలాకవి' అన్నాడు కవి సుమిత్రానందన పంత్, 'వియోగీహోగా పహిలాకవి, ఆహ్ సే ఉపజా హోగా గాన్ ఉమడ్ కర్ ఆంఖోం సే చుప్ చాప్, బహీ హోగీ కవితా అనజాన్,' వియోగి ఆది కవి ఔతాడు. నిశ్శ్వాసాలనుండి గానం వెల్వడియుంటుంది. కళ్లనుండి ఉబికి కవిత నిశ్శబ్దంగా, అజ్ఞాతంగా ప్రవహించియుంటుంది. అని అభిప్రాయపడ్డాడు. ఈ కావ్యప్రపంచమే కాదు, అసలు ప్రపంచమేకూడ ఈ వసువేదన వల్లనే సృష్టిమైనదని మరొకచోట వ్యక్తంచేశాడు.

'వేదనాకేహీ సురీలే హాథ్ సే హై బనా, యహ్ విశ్వ.
ఇస్ కా పరమ్ సుందర్ వేదనాహీ వేదనాహీ హై'।

అని ఇరవైయవ శతాబ్ది ఆరంభంలో హిందీ క్షేత్రంలో ఉదయించిన ఛాయావాది కవిత్వంలో దుఃఖాభివ్యక్తి ఒక ముఖ్యాంశం. హిందీలో కవి ప్రసాద్ దుఃఖాన్ని ఒక శ్రుతిలో యెత్తుకొనగా, పంత్ దానిని అదే శ్రుతిలో అందుకొని ఆలపించాడు. ఛాయావాది కవులకు పంత్ ముఖ్య ప్రతినిధి. బాల్యం నుండి ఏకాంతంలో పెరిగాడు. ఈయన శైశవంనుంచే మాతృప్రేమ లోపించింది. తర్వాత పితృ వియోగం కల్గింది. ఇవన్నీ కవికి దుఃఖవాతావరణాన్నిచ్చాయి. దీనికితోడు ప్రణయయౌవనంలో ఉన్న కవికి, తీవ్ర ఆశాభంగం కల్గింది. ప్రణయగ్రంథి సడలిపోయింది. అప్పట్లో చెప్పుకున్నాడు కవి—

"హాయ్ మేరే సామ్నే హీ ప్రణయ్ కా గ్రంథిబంధన్ హోగయా,
వహ్ నవకుసుమ మధుపసా మేరా హృదయ లేకర్ కిసీ
అన్యమానస్ కా విభూషణ్ హోగయా!

ఇయ్యది కవి హృదయంపై తీవ్ర ఆఘాతం కల్గించింది. పంత్‌లోని కవి కూడా యీ వియోగంలోనే ఉదయించాడు. పై శీర్షికా సూత్రానికి పంత్

కావు. అవి శోకసంగీతానికి మధురచ్ఛందస్సులు. ఈ మధుర లయకు ఇక అంతులేదా" ? అని ప్రశ్నిస్తున్నాడు కవి.

దుఃఖాన్ని వ్యక్తంచేయడంలో యీయన కేదో ప్రత్యేక కౌశల మున్నది. ఈ సందర్భంలో ఈయన పదాలు వజ్రాదపికఠోరాణి అయి పాఠకుల హృదయాలపై సమ్మెటపోట్లు పెట్టుతవి.

వియోగజ్వాలలలో మండే కవి ప్రకృతిని కూడా తన సాధర్మ్యంతోనే చూస్తాడు.

"చినగిరియోంసే తారోంకో, డాల్, ఆగ్ కా సా అంగార్ శశిలాల్,
లహాకతాహై ఫైలామతిజ్వాల్, జగ్ కో డసతాహై తమ కాల్"

పచ్చకామెలవానికి లోకమంతా పచ్చగాకన్పడినట్లు, నక్షత్రాలు చంద్రుడూ- అగ్నిలో మండుతున్నట్లున్నూ తమస్సనేకాల సర్పము జగత్తునే జ్వాల జిహ్వలతో దశిస్తూన్నట్లున్నూ గోచరిస్తుందిట. ఇంకోచోట-

'ఆజ్ సోనేకా సంధ్యాకాల్ - జల్ రహా జను గృహసావికరాల్'

సంధ్యాకాలంలో యిల్లు కాలు తున్నట్లు కన్పిస్తున్నదట, క్రి. ది చరణాలు చూడండి-

"మేరే పావసబునకు సా జీవన్, మానస్‌సా ఉమడ్ అపారమన్,
గహారే ధుంధలేధులే సాంపలే, మేఘోంసే మేరే భరే నయన్".!

కవికళ్ళల్లోనే మేఘాలున్నవిట, ఆయన మనస్సు మానస సరస్సు. ఆయన జీవితమే వర్షర్తువు, కవి ప్రావృషంభోధరస్వామి అన్నమాట. ఇక వర్షాని కేమి కొదవ- ఏ వర్షం? అశ్రువర్షం. నదిలో ప్రవాహ ముప్పొంగినపుడు పరీవాహమై యిరు గట్లను లంఘించి ప్రవహిస్తుంది. కవిహృదయంలో శోకపూర ముప్పొంగినపుడు అది విలాప రూపాన్ని ధరిస్తుంది. 'శోక క్షోభేచహృదయం ప్రలాపై రవధార్యతే' అన్నాడు భవభూతి. అపుడు విలాపమే లేకపోతే హృదయమే నిలవదు. విలాపమే కవికొక ఊత నిచ్చి, తృప్తినిచ్చి హృదయాన్ని నిలబెడుతుంది. అందుచే కవి ముక్త కంఠంతో రోదిస్తాడు-

"హృదయరో అపనే దుఃఖకా భార్
హృదయరో ఉన్‌కో హైం అధికార్
హృదయరో యహ్ జాడ స్వేచ్ఛాచార్
శిశిర కా సా సమీర సంచార్
[illegible]

ఉమడ్ తే హైఁ నభ పే లోచన్
విశ్వవాణీహీ హై క్రందన్
విశ్వకా కావ్య అశ్రుకణ్
హాయ్ మేరా జీవన్ ప్రేమబో, ఆంసూ కే కణ్ ॥"

కవి తన హృదయాన్ని విశృంఖలంగా రోదించ మంటాడు. తన దుర్భరశోక విషమ గీతాలను యెలుగెత్తి యేడ్చివేయ మంటాడు. దుఃఖతుడైన కవికి విశ్వమే దుఃఖశంగా కన్పిస్తుంది. విశ్వం యొక్క సముద్రమనే మనస్సు వెక్కి వెక్కి యేడుస్తున్నది. ఆకాశమనే నయనాలు కన్నీటిని పొంగి పొరలింప జేస్తున్నాయి. విశ్వవాణియే ఆక్రందిస్తూన్నది. అశ్రుకణాలే విశ్వ కావ్యం యొక్క పదాలు.

ఒక్కొక్క కవి లోకదుఃఖాన్ని తన దుఃఖం చేసుకుంటే మరి యొక్క కవి తన దుఃఖాన్ని లోకదుఃఖం చేస్తాడట. తెలుగులో అంటారు. "అందరి బాధా శ్రీశ్రీ యొక్క బాధ ఐతే, కృష్ణశాస్త్రి బాధ అందరి బాధాను." కృష్ణశాస్త్రి బాధ వలె పంత్ వేదన కూడా విశ్వవేదనగా పరిణమిస్తుంది. అపుడు విశ్వమే పంత్ విలాపంతో శృతి కలిపి ఆలపిస్తుంది, అపుడు 'అపిగ్రావా రోదితి' అనిపిస్తుంది. ఇట్లా కవికి కొన్నాళ్లకి దుఃఖం అలవాటయిపోతుంది. దుఃఖము ప్రాణసఖి వంటిదౌతుంది. అప్పుడు దుఃఖాన్నే కోరి ఆవాహన చేస్తాడు.

"ఆవో మేరే స్వర్ మేఁ గావో
జీవన్ కే కర్కశ స్వర్
మేరే వంశమేఁ లయబన్‌జావో
కరుణా క్రందన్ కరనే దో॥

జీవనంలోని కర్కశ, కరుణస్వరాల్ని తన గొంతుతో గొంతు కలిపి గానం చేయమని ఆహ్వానిస్తాడు. దుఃఖపూరంలో మునిగి తేలిన కవికి దుఃఖము అలవాటు అయిపోవడం అట్లుండగా దుఃఖమే అమూల్యము, అపూర్వమునగు ఆనందంగా పరిణమిస్తుంది. అశ్రుహాలాహలమే అమృత మాధుర్యాన్ని సంతరించుకుంటుంది. 'గ్రంథి,' 'ఉచ్ఛ్వాస్,' 'ఆఁసూ,' కవితలు కరుణాధారముచే ప్రేరితములు. ఆవేశము, యువ కవి యొక్క ఉన్మత్త గానము వీనియందున్నది. ప్రేమ యొక్క తన్మయత్వము అభ్యాసమున్నది. తీవ్రవేదనాయత కరుణావిష్కరణ మున్నది.

ఛాయావాది త్రయంలో మూడవవాడైనా పంత్ ఛాయావాది కవితకు ముఖ్యుడు, నిజమైన ప్రతినిధి. పంత్ యొక్క ప్రకృతి నాజూకుతనం, సౌందర్యలాలసత. ఆయన పెరిగిన వాతావరణం ఆయన్ని చక్కని ఛాయావాది కవిని, సౌందర్య కవిని చేశాయి. మనః ప్రకృతిని బట్టి పంత్ ప్రగతి కవి కావలసినవాడు కాడు. ఈ భక్తి ఆయనలో కృత్రిమమూ, అసహజమున్నూ, కాలప్రవాహానికి వెనకబడతానేమో ననే భయంతో తెచ్చుకొని వ్రాసినది. ఇది సహజ పరిణామం కాదు. లత చెట్టుగా మారిపోతే యెలా? ఈ విభిన్నధారలు ఒకే కలంనుండి పుట్టుకురావడం అసహజం స్థూలంపై సూక్ష్మం యొక్క తిరుగుబాటు ఛాయావాదం అనీ, సూక్ష్మంపై స్థూలం యొక్క ప్రతిక్రియ ప్రగతి కవిత్వమనీ అన్నారు ఛాయావాదులు. బాహ్యజగత్తు ఆంతరికజగత్తు యొక్క ఛాయ అని అంటే ప్రగతి వాదులు అంతర్జగత్తు బాహ్యజగత్తు యొక్క ఛాయ అంటారు. ఛాయావాదం అభ్యంతర జీవితంపై ఆధారపడ్డది. రెండవది బాహ్యజీవితంపై, మొదటిది సౌందర్య ప్రధానము, లావణ్యభరితము, రెండవది అసుందరతను అసహ్యించుకొననిది. ఇట్టి విరుద్ధతత్త్వాలు రెండూ ఒక కవికి సహజ ప్రవృత్తులు అవడం అగ్నికి వేడిమీ చల్లదనం రెండూ సహజ గుణములు అనడం వంటింది. ఇందు ఒక్కటే కవి యొక్క నిసర్గ ప్రవృత్తి కాగలదు. 'గ్రామ్యా,' 'యుగవాణి' లలోని సిద్ధాంతాలు పంత్ అనుభూతితో వ్రాసినవి కావు. శ్రుత జ్ఞానంతో వ్రాసినవి. ఇందు జీవితమును నిషేపించలేదు. అందుచే సౌందర్యము మృగ్యమే, ఒకే కవి అల్పకాలంలో రెండు విభిన్న కవితా మార్గాలలో సంచరించిన ఉదాహరణం అన్యత్రా లభించదు. ప్రకృతిని, సంస్కారమును బట్టి పంత్ ఛాయావాది కవి. అందునా, దుఃఖము యీతని కవితా ప్రవాహమున ముఖ్యస్రోతస్సు. కరుణ యీతని సహజధార. ఈతనిలోని కవి కరుణధారలో వర్ధిల్లాడు. ఈతని కరుణకవిత్వం అనుభూతి యుతమగుటచే సౌందర్యలావణ్య భరితం. పంత్ స్వయంగా 'వియోగీహోగా పహిలా కవి' అనే సూత్రానికి సజీవమైన ఉజ్జ్వలమైన ఉదాహరణం.



కవిత :

# రాజేంద్ర కర్ణపూరము

-శ్రీ దివాకర్ల వేంకటావధాని

సురతాంతంబున శైలజా కుచతటిన్ సొంపారుగోర్నొక్కులన్
బరిశీలింపుచు నామె కన్బొమలతో వాదాడు వాడంచు నీ
శ్వరుఁడెవ్వానిని బిండి తుష్టిగ సుధాస్యందంబు గావించె నా
హరచూడామణి రోహిణీశ్వరుఁడు మీకైశ్వర్యమున్ గూర్చుతన్

వామ కుచ సీమఁ గర్పూర పత్రశోభఁ
కలుగఁజేయుచుఁ దాండవగతినిమౌళి
నదరి జారిన బాల శశాంకరేఖ
శివునితోఁగూడి మమ్ము రక్షించుఁగాక !

మల్లెలయందు ముత్యముల ముక్కువవీఁడి శ్రవోయుగంబులం
దెల్లరు శంభువాగ్రచనలే యవతంసముగా గ్రహింప వా
రుల్లములందహో ప్రణయ మూనరు కాముని వింటినాదముల్
వల్లనసేయు కోకిలల పాటలపై నణు మాత్రమేనియున్

నింగికిఁబ్రాకి చంద్రుఁడన నీయశమాశల నిండ వెల్లవే
యుంగఁ దమంబు మూలఁబడె నంబుధులన్నియుఁ బాలవెల్లులే
న్గంగమివేల్పు టేనుగులు కోకిల హంసయుఁ బాముశేషుఁడ
య్యెంగిరులద్రి జాథపుని యిండ్లయి వన్నెకు నెక్కె భూవరా !

పీసరవోని గాత్రముల వేలుపు టాంద్రుడు పికంబులట్లుకై
లాసగిరీంద్ర సానువులఁ బ్రాజ్యభవద్యశమున్ బఠింపఁగై
సేసి మణిప్రదీపమన శీర్షసుధాకరరేఖ దానమున్
జేసెను వెంటనే త్రిపురజేత రతీసతికిన్ ప్రియమ్ముగా

చోళభూ భృదనేక శుద్ధాంత కాంతల
మౌళ్యలంకారముల్ మంటఁగలిపి
కర్ణాట నరపాల పూర్ణేందువదనల
కరావతంసముల్ కత్తిరించి
ే ళమురళ భూదారక దారల
హార భారంబుల నపహరించి
లాట భూమీశాన లలనాజనమ్ముల
నుదుటికస్తూరి బొట్లు పదటఁగలిపి

యెదురువారలు లేక దేవేంద్రుఁడైన,
ెరచి శరణని కాళ్లపై నొరగునట్లు,
యశ స్వర్ణశాణమై నాల్గు దెసల
పీ కృపాణము జయము సంధించె భూప!

చదువుల మాని ధ్యానమును సాఁగఁగఁద్రోలి తపస్సు నావలన్
వదలి విలాస లోలుఁడగు బ్రహ్మ నినున్ సృజియించె నయ్యదు
ర్మద జనశిక్ష సజ్జన పురస్కృతిలోక జయమ్ము యాచకా
భ్యుదయము సూరిగౌరవము భూమిపతాపమొనర్చు కోసమై

మనుజామర్త్య భుజంగలోకముల నే మాత్రం బొయున్నారలుం
దను వచ్చున్ మహితాత్ములైనఁ గనుపట్టన్ బోవరవ్వారిలో
దనుకాంతిన్ మతిసత్త్వమున్ సుకవి వాక్తాత్పర్య విజ్ఞానమున్
దును శత్రుక్షణ నంటునన్ యశముపందున్ నీకుఁ దుల్యుండవో!

సంతుష్టిన్ ముచికుందమా! కనుమిఁకన్ శాంతించువాసంతి! మే
లెంతే నీ కగుమల్లికా! కుశలమోసీ! మాలతీ! నీకు భూ
కాంతాత్యున్నత కీర్తిపల్లవములే కర్ణావతంసంబులై
సంతంబూనరు మీ నవీన కలికాభంగంబులన్ గామినుల్

మతినశియించె సంస్మృతులు మాసె స్థితుల్చెడిపోయె సక్తి వి
చ్యుతమయిపోయె ధైర్యగతు లూగెను నిర్వృతియైన లేదు భూ
పతివరియించు కాంతలకుఁ బల్మరు చైత్రురతిన్ స్మరింపకో
యతనుఁడ ! మార్గణప్రతతి నావలఁద్రోసి ధనుస్సు వీడుమా !

మురుగుల పీఁడనాఁడి పురమున్ దృజియించెను గొంకణుండు మా
యురె ! వనికేగెఁ గుంతలము లూగ హాటాహాటిఁ గొంతలుండు భీ
కరమృగమైన మారవము కచ్ఛము మాలవుఁడాశ్రయించెనం
తరితరమాలవుండగుచుఁ దావకకోపము విన్నమాత్రనే

వందుల మందరక్తి సురభామలవీనుల విందుగాఁగ సం
క్రందనుమ్రోల నీతనువిలాసముఁ దెల్పఁగవిన్న మన్మథుం
డందె విచారమావల శరాసన బాణము లుజ్జగించె నే
మందు రతీసతిన్ గనఁడుహాయని మాధవు జూచె వింతఁగన్

కీరమండల వసన్నారీ పయోధర ప్రథితముక్తాహార పటలమందు
కేరళదేశీయ సారసాక్షీకైశ్యరమణీయతర సుమస్రజములందు
చోళసీమంతినీ లీలావిలోలాస్య మహనీయదంత కుట్మలములందు
మాళకాంతామనోహర సుధామధురోష్ఠ సీమలనటియించు
స్మితములందు

గలుగు ధావళ్యమును సుధాకరమయూఖ
కాంతిని దిరస్కరించు నీఘన యశస్సు
మాయమొనరింపఁగవులు సమ్మతి నుతింతు
రంతలోఁ దిట్టిపోయుదు రవనినాథ !

(సశేషము)

శ్రవ్య నాటిక :

# చల్లని చీకటి

—శ్రీ రావూరి భరద్వాజ

[ పావు నిమిషం పాటు హోరుమంటూ గాలి వీచి, క్రమంగా ఫేడవుట్. గాలి తగ్గడం ప్రారంభించి నప్పట్నుంచీ... ]

1 గొంతు: అబ్బబ్బా. లోకాని కేదో ప్రళయం ముంచుకొచ్చినట్లుగా ఉంది. ఇందాకణ్ణుంచీ చూస్తున్నాను. ఒకటే హోరు గాలి.

(గాలి వీచిన చప్పుడు)

తగ్గినట్టే ఉంటుంది. అంతలోనే ఎవరో తరుము కొస్తున్నట్టుగా, రయ్యిన వీస్తుంది. కసిబట్టి ఘోష పెడుతున్నట్టుగా వీస్తుంది. (క్షణం విరామానంతరం) ఇప్పుడు టైమెంతయిందో తెలీదు. సుమారు ఎంత అయిఉంటుందో, 9, 10, 11, 12, 13,- అబ్బే కాదు... (ఆగి) ఊహూ. చెప్పుకోవడం కష్టం. ఎంతయితే నేమిటి గానీ ఈ చలిగాలికి తట్టుకోలేకుండా ఉన్నాను. కాళ్లూ చేతులూ చలికి బిగదీసుకు పోయాయి. అందులోనూ కన్ను పొడుచుకున్నా కనిపించని చీకటి. వెలుతురుంటే ఇంత బాధ ఉండకపోను... (బరువుగా నవ్వి) ఆఁ, నా పిచ్చి గాకపోతే, వెలుతురు ఉంటే చలెయ్యదూ ?

(మళ్లీ హోరుమని గాలి)

అబ్బబ్బా. చర్మం పగిలిపోతున్నది. ఈ దిక్కుమాలిన సత్రం కట్టించిన వాడికి తలుపులు ఉంచాలన్న జ్ఞానమే లేకపోయె.

(దూరంనుండి దగ్గు వినిపిస్తుంది)

ఓహోహో. ఇంతసేపణ్ణుంచీ నేనొక్కడ్నే ననుకొంటున్నాను. నాకు తోడు మరొకడున్నాడు... సరి సరి మంచి కాలక్షేపం. ఏమండోయ్.

2 గొంతు: (దగ్గుతాడు చలికి వణికినట్లు... ఓహోహో అంటుంటాడు)

1 గొంతు: విన్నే వయ్యోయ్ ?

2 గొంతు: ఏమిటి ?

1 గొంతు: ఎక్కడున్నావయ్యా స్వామీ ?

2 గొంతు: ఇక్కడున్నాను.

1 గొంతు: నాయనా. ఈ కారుచీకట్లో ఇక్కడకూ అక్కడకూ పెద్ద భేదం కనిపించడం లేదు.

2 గొంతు: కనిపించదు.

1 గొంతు: ఏంచేతంటావ్ బాబూ ?

2 గొంతు: నాకు తెలీదు. నను అట్టే విసిగించకు.

1 గొంతు: నిద్ర పోతావా ?

2 గొంతు: ఎందుకు నాయనా ! నీకా వివరాలన్నీ ?

1 గొంతు: మరేం లేదు. ఈ ఘోరమైన చలిలో నీకెలా నిద్రపడుతున్నదో తెలుసుకొందా మనుకొంటున్నాను. ఇందాకట్నించీ ప్రయత్నించినా నాకు కళ్లు మూతలు పట్టం లేదు.

2 గొంతు: నాకూ అంతే.

1 గొంతు: మరింకేం నాయనా. హాయిగా పిచ్చాపాటీ మాట్లాడుకోకుండా...

2 గొంతు: గమ్మున నిద్రపోదాం...

1 గొంతు: ఈ చలిగాలి ఘోరంగా ఉంది కదూ ?

2 గొంతు: నిజమేగానీ మాట్లాడుతుంటే తగ్గుతుందంటావా మరి ?

1 గొంతు: తగ్గినా తగ్గక పోయినా, మాటల సందడిలోపడి చలి విషయం మరిచిపోతాం. ఏమంటావ్ ?

2 గొంతు: కాదు.

1 గొంతు: ఇన్నిటికే నీ పేరేమిటో చెప్పావు కాదు. ఏమిటబ్బాయ్ ?

2 గొంతు: ఏదో వో పేరు. వల్లకాట్లో రామరుద్రాయ.

1 గొంతు: భేషూ ! అయితే నిన్ను రుద్రయ్యా అని పిలుస్తాను. చూడు రుద్రయ్యా.

2 గొంతు: ఏం చూడను. నేను నాకే కనిపించక పోతుంటే ?

1 గొంతు: అవునవును. విను రుద్రయ్యా. అన్నట్టు నా పేరు చెప్పాను గాదు.

2 గొంతు: నాకు వినాలని లేదు.

1 గొంతు: అయినా చెబుతాను. నీ పేరేమిటన్నావూ. రుద్రయ్యగారూ ? యమకంగా గూడా ఉంటుంది. నా పేరు భద్రయ్య.

రుద్ర : సరే.

భద్ర : రుద్రయ్యా. ఈ పాడుపడ్డ సత్రంలో, ఇంతసేపణ్నుంచీ నేనొక్కణ్నే అనుకొంటున్నాను.

రుద్ర : అనుకో.

భద్ర : అనుకొంటుంటే ఎంత భయం వేసిందనుకొన్నావ్ ? గుండె లవిసిపోయాయంటే నమ్ము. అందులోను, ఈ దిక్కుమాలిన చలొకటి ? పుస్తకాల్లో రాస్తుంటారు చూశావూ. హిమ ప్రళయమని, అలాంటి దేదో వచ్చిందేమో ననిపించింది.

రుద్ర : వచ్చినా బావుణ్ను. ఈ పిళ్లంతా సమసిపోతుంది,

భద్ర : రుద్రయ్యా. లోకం మీద నీకు చాలా కసిగా ఉంది కదూ ?

రుద్ర : ఉముంటే ఏం లాభం ? అది తీర్చుకొనే అవకాశం లేనప్పుడు ?

భద్ర : అనుకొన్నప్పుడల్లా అవకాశం రాదు. రుద్రయ్యా.

రుద్ర : అవును.

భద్ర : అందుకోసం ఒక్కోసారి ఏళ్ల పర్యంతము ఎదురు చూడవలసి ఉంటుంది. ఒక్కోడికి, జీవితంలో అలా కసితీర్చుకొనే అదృష్టమే ఉండదు.

రుద్ర : అలా ఉండకపోవడం కన్నా దురదృష్టం నువ్వూహిస్తావా ?

భద్ర : నాకూ ఉంది కసి. ఏం లాభం ?

రుద్ర : అయితే మనిద్దరం ఒకే కోవలో వాళ్ళ మన్నమాట ? భేషూ అయితే నీ విషయం ఏమిటి నాన్నా ?

భద్ర : ముందు నువ్వు ప్రారంభించు.

రుద్ర : నా విషయానికి ప్రారంభం, అంతం అంటూ లేదు. ఎందుకు లెండి...అవన్నీ జ్ఞాపకం చేసుకొని మనస్సు పాడుచేసుకోవడం ?

భద్ర : (అనుమానంగా) ప్రేమ గొడవ కాదు కదా ?

రుద్ర : అరె ! ఎలా కనుక్కున్నారు ? నిజమే సుమండీ.

భద్ర : సరే నీ కథను నేను మొదలెడతాను. నువ్వుకొనసాగించు. నువ్వో అమ్మాయిని గాఢంగా ప్రేమించావు.

రుద్ర : క్షమించండి. దానికి గాఢంగా అన్నమాట-ఎంతమాత్రం చాలదు. ఎంతగా ప్రేమించానంటే, ఆ అమ్మాయి తప్ప, నాకీ ప్రపంచంలో, ఇంకేదీ అవసరమనిపించ లేదు. ప్రతిక్షణం నా వెంటనే వుంది,

నన్నేదో మత్తులో ముంచుతున్నట్టుండేది. (ఆగి) ఏం వింటున్నారా?

భద్ర : ఆఁహాఁ.

రుద్ర : సన్నగా, పొడుగ్గా, రివటలా ఉండేది. చిన్న నోరు. సోగమొఖం. తెల్లగా, తెలివిగా, తళ తళ లాడే కళ్లు, పచ్చగా, కొండల వెనక పెరిగే, సాయంత్రం మబ్బులా, గడ్డిలోని నేవళంలా,-ఎంత బావుండేదనుకొన్నావు, రెండు సంవత్సరాలు, ఆమె కోసం తపించాను.

భద్ర : అయినా అవిడ నీకు దక్కలేదు కదూ?

రుద్ర : లేదు. నా ఆశలన్నీ నట్టేటిలో ముంచింది. నా కలలన్నీ, గాలి బూదిరాసులై పోయ్యాయి. (క్షణమాగి) భద్రయ్యగారూ కవిత్వం మాట్లాడుతున్నానా?

భద్ర : ఆఁ.

రుద్ర : అందమయిన ప్రతి ఆడదాని హృదయమూ అందంగా ఉంటుందనుకోవడం తప్పుకదూ?

భద్ర : చాలా తప్పు. కానీ ప్రేమించిన వాడు, అలా అనుకోకా మానడూ, ఆశాభంగం పొందకా మానడు.

రుద్ర : బాగా అన్నారు. నేనూ ఆశాభంగాన్నే పొందాను. నన్ను నిలువునా అన్యాయం చేసి, ఆవిడ నాకు దూరమయింది. రెండేళ్ల పాటు, కలిసి మెలిసి తిరిగిన స్నేహమంతా క్షణంలో కాలి తన్నింది.

భద్ర : ఆడదానికి బొత్తిగా హృదయం లేదు, బ్రదర్. ఏమంటావ్?

రుద్ర : పూర్తిగా ఏకీభవిస్తున్నాను. హృదయమే ఉంటే నన్నిలా అన్యాయం చేస్తుందంటారా?

భద్ర : పిచ్చివాడా, నువ్వింకా దొడ్డిగుమ్మం దగ్గరే ఉన్నావ్ నాతో పోల్చి చూసుకొంటే నువ్వుచాలా అదృష్ట వంతుడివి గదుటోయ్.

రుద్ర : కాదనుకొంటాను.

భద్ర : నీకింకా. ఆవిడతో పెళ్లి పెటాకులూ కాలేదు. ఆవిడకోసం నువ్వేం త్యాగం చేశావో నాకు తెలీదు. నేను నా భార్య కోసం చాలా కోల్పోయాను. వేల రూపాయల కట్నాన్ని చేజేతులా వదులు

కొన్నాను. ఎన్నెన్ని విధాలచెప్పినా వినిపించుకోకుండా అవిణ్ని చేసుకొన్నాను. ఈ పెళ్ళితో, నావారందరికీ దూర మయ్యాను.

రుద్ర : అవిడిప్పుడు......

భద్ర : నాది కాకుండా పోయింది భాయీ. ఆమె నన్ను నిలువునా మోసగించింది. నిలువునా దహించింది.

రుద్ర : అసలు ఆడజాతే అటువంటిదేమో ననుకొంటాను.

భద్ర : తప్పకుండా (ఆగి) మిస్టర్. కొంతకాలానిగ్గానీ నాకు అసలు సంగతి తెలిసింది కాదు. ఆవిడ నా దగ్గ రున్నా, మనస్సు ఇంకెక్కడో ఉండేది. ఆవిడ పెట్టెలో ప్రియుడు వ్రాసిన ఉత్తరా లున్నాయి.

(దూరంగా పాడిదగ్గు వినిపిస్తుంది)

రుద్ర : ఎవరో వస్తున్నట్టుంధి గాదూ ?

భద్ర : కనిపించడం లేదు. వినాలిసిందే.

రుద్ర : ఖర్మం. ఇక్కడా మనకి ఆడమళయాళం తప్పడం లేదు...వినండి... గాజులు చప్పుడౌతున్నాయి గాదూ ?

భద్ర : ఇశ్శో. మాట్లాడకండి ... మరో మగవాడు గూడా వెంట ఉన్నట్టుంది.

(దూరంనుండి క్రమంగా దగ్గరౌతూ)

స్త్రీ : ఎంత శ్రమ పెట్టాను నాన్నా నిన్ను ?

పురు ఎక్కడో తోవ తప్పాం తల్లీ. అందుకే ఇన్ని అవస్థలు...ఇక్కడెక్కడో ఓపాడు పడిన సత్రం ఉండాలి. (ఆగి) ఇక్కడే... ఇదుగో ... ఇదే ... ననుకొంటూ ఈ రాత్రి ఇందులో తలదాచుకొని......

స్త్రీ : నాన్నా !

పురు : ఏమిటి తల్లీ ?

స్త్రీ : వారు ఒప్పుకొంటారంటావా నాన్నా ?

పురు : నేనేం చెప్పనమ్మా ? ఏనాటికయినా ధర్మం గెలుస్తుంధి తల్లీ.

స్త్రీ : ఆరునెల్లనుండి అన్ని కబుర్లు చేశాం గదా, ఒక్కదానికి జవాబు రాయని మనిషి ?

పురు : వెళ్ళి అడుగుదాం. నీకోసం ఆయన కాళ్లు పట్టుకొంటాను. నా చర్మంతో చెప్పులు కుట్టిస్తాను. ఇంత కన్నా నేనేం చేయనమ్మా! చెప్పు !!

స్త్రీ : (బిగ్గరగా...) ఏమిటి నాన్నా ఆ మాటలు?

పురు : నీ సుఖం కన్నా నాకు కావలసిందేమీ లేదు తల్లీ. నీ మంచితనం నాకు తెలుసుగానీ. ఈ......

( హోరుమని గాలివీచి మాటలు వినిపించవు )

స్త్రీ : చాల చలిగా ఉంది నాన్నా. పోనీ ఇలా లోపలికి రాగూడదూ?

పురు : కన్ను పొడుచుకున్నా కనిపించడం లేదు. ఉండమ్మా అగ్గిపుల్ల గీస్తాను.

( అగ్గిపుల్ల గీచిన ధ్వని )

స్త్రీ : ఇక్కడేదో నుక్కు చాలా ఉంది. మరోపుల్ల గియ్యి నాన్నా కాస్త చలిమంటన్నా వేసుకొందాం.

( మరోపుల్ల గీచిన చప్పుడు )

పురు : హమ్మయ్య! ఈ చలికి వేళ్లన్నీ కొంకర్లుపోయాయి...నువ్వుకొంచెం పక్కకు తప్పుకో తల్లీ. చలిమంట ఊద్దాం...ఉఫ్...ఉఫ్...ఉఫ్.

స్త్రీ : ఇటువేపు రా నాన్నా. మరి పొగంతా నీవేపుకే వస్తోంది... (గుండెలవిసిపోయేలా బిగ్గరగా)... నాన్నా. నాన్నా...

పురు , ఏంటమ్మా. (బిగ్గరగా) ఆఁ... ఎవరు నువ్వు?

భద్ర : నువ్వు వెతకబోతున్న వాణ్ని. మీకు కనిపించకుండా, మీ పాపిష్టి మొఖాలు మళ్ళీ చూడకుండా, ఎటన్నా పోదామనుకొన్నాను. మళ్లీ నాకిక్కడ దాపరించారు.

స్త్రీ : ఏమండీ ?

భద్ర : నోరుముయ్. ధగిడీ. నువ్వు బ్రతికున్నంత కాలమూ, నాకు మనశ్శాంతి లేదు. అందుకనీ...

పురు : బాబూ! బాబూ! తల్లీ!!

స్త్రీ : (ఎవరో గొంతు నొక్కుతున్నట్టు)...నాన్నా...నా...న్నా...

భద్ర : ఈ క్షణంలో, నీకూ, నీ నాన్నకు సరి... (బాధగా)...అబ్బా. విడువ్ విడువ్...

రుద్ర : నేను విడవను... నేమా నీ కోసమే ఇంతకాలంగా వెతుకుతున్నాను...

స్త్రీ : మోహన్. మోహన్.

రుద్ర : నువ్వుండు భానూ.

స్త్రీ : నామాట వినవా మోహన్ ?

భద్ర : నీపేరు మోహనా ?

రుద్ర : నీపేరు విశ్వం కదూ ?

భద్ర : అవును. ఇందాక నీతో చెప్పిందే, భార్యని... ఈ విడే. నీకు తెలుసునను కొంటాను.

రుద్ర : బాగా తెలుసు. రెండుసంవత్సరాల పాటు తెలుసు.

భద్ర : (అనుమానంగా)...అయితే...

రుద్ర : అవును.

భద్ర : ఆ ఉత్తరం రాసింది నువ్వేనా ?

పురు : నాయనా నామాట విను. జరిగినదానికి మన్నించి...

రుద్ర : జరిగింది కూడా ఏమీ లేదు...విశ్వం గారూ-అరే, భద్రయ్యగారూ- ఇందాక మీకో విషయం చెబుదామనుకొని గూడా మానేశాను... అది నేను చేసిన పొరబాటు. రెండు సంవత్సరాల స్నేహాన్ని పురస్కరించుకొని, భానును నన్ను పెళ్లాడమని అడిగాను... ఇంకా చెంప మీద గుర్తు పోలేదు. ఆఖరిసారిగా ఉత్తరం రాశాను.

భద్ర : చూశాను. చివర నీ సంతకం ఉంది.

భాను : ఆ ఉత్తరమే ఇన్ని అనర్థాలకు దారి తీసింది మోహన్. పాపిష్టి దాన్ని చింపేసినా చింపాను కాదు. కానీ...రెండు సంవత్సరాల స్నేహానికి చిహ్నంగా అదే మిగిలింది...

రుద్ర : నువ్వా మాటలంటున్నప్పుడే నాకు అనుమానం కలిగింది భద్రయ్యా పురఫ్ విశ్వం గారూ. అయినా ..సరే నేను అడ్డుకోకపోతే భానును అన్యాయంగా చంపేసి ఉండేవాడివి,

పురు : ఏదో జరిగిపోయింది నాయనా. అందరం ఒక చోట కలిశాం... కాస్సేపు ఈ చలిమంట దగ్గర కూచుని, హాయిగా గడిపేద్దాం అనుకుంటారు ?

రుద్ర : నా ఉత్తరం వల్లనే ఇదంతా జరిగిందని తెలుసుకొని చాలా విచారించాను. నీ కోసమే బయలు దేరాను విశ్వం.

భాను : మోహన్. మాటలు కట్టిపెట్టు. ఆ చెత్తా చెదారం పోగు చెయ్యి. చలిమంట తగ్గిపోతోంది.

భద్ర : (బాధగా) అవును.

ఛ ఛ...ఎలాంటి రాత్రిది.

( హోరుమని గాలి చేప్పుడు )



కవిరాజు రచనలు:

# సూతపురాణము

—శ్రీ త్రిపురనేని సుబ్బారావు

సాంఘిక వ్యవస్థలో మార్పు వచ్చే ముందు భావంలో మార్పు రావాలి. మూఢనమ్మకాలు మటుమాయం కావాలి. అంధ విశ్వాసాలు అంతరించాలి. అన్నింటి భారమూ భగవంతుని మీద వేసే అలసత్వం పటాపంచలు కావాలి. తన పనికి తనే బాధ్యుడను అన్న జ్ఞానం కలగాలి. తన జీవితం యిలా ఉండడానికి, తన చుట్టూవున్న పరిస్థితులే కారణం గాని మరేదో అదృశ్య శక్తి లేదా, శక్తులు కారణమన్న అపోహ తొలగాలి. అలా జరిగినప్పుడే మనిషి తన శక్తిని తాను తెలిసికొంటాడు. తనలావుండడానికి కారణం తనలాంటి వాడేనన్న సత్యం తెలియగానే తన స్థితిని బాగుచేసికోడానికి నడుంబిగిస్తాడు. పట్టుదల వహిస్తాడు. కార్యరంగంలోకి దూకుతాడు. ప్రచండంగా విజృంభించి విజయం సాధిస్తాడు.

వైదికమతం యిందుకనే అడ్డంకులు కల్పించింది. వర్ణాశ్రమ ధర్మాలను నెలకొల్పింది. దేవుణ్ణి, దేవతలనూ సృష్టించింది. ద్విజత్వం - బ్రతుకే రెండు జన్మలు - చేసి పవిత్రమైన అగ్రజాతిగా కొందరిని ప్రచారం చేసింది. మరికొందరిని బానిసత్వంలో శాశ్వతంగా ఉంచే సూత్రాలను 'మనుధర్మ శాస్త్రం' పేర సృష్టించింది. జాతివిభేదాలు రెచ్చగొట్టింది. శూద్రజాతికి వేదాలు చదివే హక్కు లేదంది. ఒకవేళ చదివితే సీసం కరిగించి చెవులలో పోయమంది. గుడులలోనికి పోవడం పాపమంది. బడులలోనికి పోవడం కూడదంది. రాజు దైవాంశసంభూతుడు గనుక తప్పుచేయడంది. ప్రజలకు ప్రశ్నించే హక్కు లేదంది. అంతా మన పూర్వజన్మ సుకృతంపైనే ఆధారపడి ఉంటుందంది. ఈ జన్మలో పాపం చేస్తే మరణించిన మరుక్షణంలోనే నరకంలో యమ బాధలకు గురికావలసి ఉంటుందని భయపెట్టింది. ఈ జన్మలో పుణ్యం చేస్తే స్వర్గానికి సోపానాలు వేయడమే అవుతుందంది. కర్మ ఫలితం అనుభవించక తప్పదంది. అంతా 'మీ కర్మ' అన్న ఒక్క ముక్కతో విశ్వమంత మనిషిని పిట్టముద్దగా మార్చేసింది. మానవునిలోని శక్తిని నీళ్ళుగార్చేసింది. అతన్నిండా దుమ్మూధూళీ కప్పింది.

ఇలాంటి సంఘస్థితి అగ్రజాతివారికే కొందరికి అసహ్యత కలిగించింది రోతపుట్టించింది. ఈ దుస్థితిని తొలగించి సంఘమును సంస్కరించవలసిన ఆవశ్యకతను శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు గుర్తించారు. 1894 సం. లో రాజమహేంద్రవరంలో నెలకొల్పబడిన 'ప్రార్థన సమాజంలో' పంతులుగారు గావించిన *ఉపన్యాసములోని కొంతభాగమును ఇచ్చట ఉటంకిస్తున్నాను." "స్వప్రయోజన పరులైనకొందరు సర్వజనులను మూఢత్వమున ముంచి, దేవతారాధనమును మాని తమ్ము నారాధించుటయే పరమార్థమని బోధించుటచేత పరులను చెఱచి తామును పాడగుచున్నారు. ఒరులను చెఱుపదలచుకొన్నవాడెప్పుడును తాను బాగుపడడు. తమ పాదధూళి శిరమున దాల్చుటయే పరమార్థమని ఇతరులకు సదా బోధించు చుండుటచేత వారికదియే విద్యయయి సర్వ విద్యలన్నియు మూలఁబడినవి. అందుచేత పర్వతములకును, నదులకును బిడ్డలు పుట్టుటవారికి గొప్ప సత్యము. కల్లు సముద్రములును నేతి సముద్రములును వారి భూగోళశాస్త్రము. సూర్యచంద్రులను పెద్ద పాము మ్రింగుట వారి ఖగోళశాస్త్రము. స్వకాయకష్టము విడిచి యిట్టి సత్యములు బోధించి జీవించుట వారి కులవృత్తి. ఇట్టి జ్ఞానవంతులు తామే సర్వజ్ఞులమనుకొనియున్న నాలుగు శాస్త్రములను తామే యభ్యసించి ఇతరులను చదువనీయక పూర్వోక్త సత్యములను ప్రవచించియే యాత్మోద్ధరణము చేసికొనుటచేత వారికి నిజమైన జ్ఞానము సంపాదించుటకు గాని, వృద్ధి పొందించుటకు గాని జనులలో వ్యాపింపజేయుటకు గాని యావశ్యకము లేకపోయినది. . అందుచేత క్రొత్త విద్యలు రాకపోగా క్రమక్రమముగా నున్న విద్యలు సహితము నశించివారికితరులను వంచించుటలే కులవిద్యలయినవి. ఈ కారణమును బట్టి మనదేశమునందు భూజనులకు మాత్రమే కాక భూదేవతలకు కూడా జ్ఞానవృద్ధిలేక మూఢత్వము సంప్రాప్తమయినది. మనదేశముయొక్క బీదతనమునకు గూడ కొంతవఱకీ వర్ణభూతమే కారణము. కల్లలకోడిగట్టి కూటసాక్ష్యములు పలికి దుర్దానములు పట్టి పొట్టపోసికొను కుటింభరాధములు తమ తమ దుశ్చరిత్రమునకు సిగ్గుపడుటకు మారుగా, సత్యసంధులయి యణుమాత్రమును ధర్మమార్గము నతిక్రమింపక కష్టార్జిత ధనముతో జీవనముచేయు బ్రాహ్మణేతరుల కంటెను జాతిమాత్రము చేతనే తామధికుల మయితిమని గర్వపడుచు వారి గాలిసోకి

*'వర్ణము' అను పుస్తకముగా ప్రచురింపబడినది.

నను తాము మైలపడుదుమని భావించుచున్నారు. ఇట్టి దుర్గర్వముచేత మనుష్యలక్షణములైన దయాదాక్షిణ్యాదులును, నీతియు మనవారి హృదయవాసములనుండి పాఱిపోగా వానిస్థానమున రాక్షసగుణములైన నిర్దయత్వాదులును దుర్నీతియు హృదయ కుహరములయందు ప్రవేశించి యథేచ్ఛగా రాజ్యము చేయుచున్నవి. అగ్రజాతివారమని గర్వపడు ఛాందసులు తమకన్నుల యెదుట చెట్టుపైనుండి శూద్రునిమీద పడినను పయికిదీయక దయాశూన్యులయి తాకినచో దమకు మైలసోకునని దూరముగా తొలగుచున్నారు." శ్రీ వీరేశలింగం పంతులుగారు ఈ విధంగా కొంతవఱకు కృషి సల్పినా, ఈ వర్ణవ్యవస్థా వృక్షాన్ని కూకటి వ్రేళ్ళతో కూల్చలేక పోయారు. ఈ పనికి రామస్వామి చౌదరిగారు పూనుకోక తప్పలేదు. ఆనాటిసంఘస్థితి చౌదరిగారి హృదయాన్ని ఎంతగానో కలవరపెట్టింది. అసలు అలాంటిపరిస్థితులు సమాజంలో వర్పడటానికి కారణాలను పరిశోధింపసాగారు రామస్వామి చౌదరిగారు. స్వార్థపరులైన అగ్రజాతి తమనిరంకుశత్వాన్ని నిలబెట్టుకోడానికి అనువుగా సృష్టించిన పౌరాణికాది గ్రంథాలు, స్వర్గనరకాలు ఒకవంక మతం, భగవంతుడు మరోవంక — సంఘాభివృద్ధికి తీవ్రమైన అటంకాలని భావించారు. వారు పెనుతుఫానులా విజృంభించి ఆధ్యాత్మిక వాదం పేరు మీదుగానూ, వర్ణవ్యవస్థ పేరు మీదుగానూ జరుగుతున్న కల్మలాన్ని క్షాళనం జేయ సంకల్పించారు.

చిరకాలజీవి, పరమకరుణా స్వభావుడు, గంగానదీతీరమున తపోనిష్ఠాగరిష్ఠుడు అయిన సూతమహర్షిని చౌదరిగారు సందర్శించి, ఈ పుణ్యభూమిగా గణనకెక్కిన భారతదేశంలో భగవంతుని పేరు మీదుగానూ, స్వర్గ-నరకాల పేరు మీదుగానూ, పూర్వగ్రంథాల పేరు మీదుగానూ జరుగుచున్న అపచారాలనూ, అన్యాయాలనూ, అసత్యాలనూ, సూతునిముందు ఏకరవు పెట్టారు. చౌదరిగారికీ సూతమహర్షికీ సుదీర్ఘమైన వాదోపవాదాలు జరిగాయి. ఎట్టకేలకు భారతదేశంలో జరుగుచున్న వంచనను, మోసమును అవగాహన చేసికొన్న సూతముని చౌదరిగారిని లోకకళ్యాణార్థం ఓకావ్యం వ్రాయమనగా వారి ఆజ్ఞాను సారంగా పాతపురాణం గాని ఈ సూతపురాణాన్ని వ్రాశారు. సూతపురాణ రచనావశ్యకతను పీఠికలో చౌదరిగారు ఇలా వివరించారు. "ప్రాకృతజనంబునకు వేదార్థము సులభైకవేద్యము కాదని యెఱింగి వైదికులును, నిష్కాములును, లోకసంసర్గరహితులును,

నిసర్గభూతదయాశీలురును నయినఋషిచంద్రులు నిర్వ్యాజకరుణా విశేషంబున "స్త్రీ శూద్రద్విజబంధువులను" ముక్తిమార్గముఁజూపి తరింపఁజేయుటకు నై వేదార్థమునుటంకించి పురాణములు వ్రాసిరని ఆర్యోక్తి. ఈ యార్యోక్తి యందు విశ్వాసముంచి మూఢలోకంబు పురాణము లాప్తేయములనియుఁ, తత్కారణమునఁ బూజ్యములనియు, తదంతర్గత ధర్మములు నీతులు, కథలు శిరోధార్యము లనియు విశ్వసించుచున్నది. ఈ విశ్వాసము వలనఁ గలిగిన ప్రతిఫలమాత్మ ద్రోహముగాఁ బరిణమించుటఁజేసి పురాణములెంతవఱకుఁ బ్రతికూలములో, ఎంతవఱకు నీతిబాహ్యములో, ఎంతవరకుఁ బక్షపాత భూయిష్టములో మాఱ్పుగన్నులతోనున్న విద్వల్లోకమునకుఁ జూపించు తలంపుతో సూతపురాణము రచింపబడినది. తత్కారణమున సూతపురాణము కారణజన్మ."

భావవిప్లవాన్ని, వర్గచైతన్యాన్ని కలిగించడానికిగాను కలాన్ని పట్టిన నవయుగ కర్త కవిరాజు. సత్యాన్వేషణ దృష్టితో తాను యదార్థమని విశ్వసించిన సిద్ధాంతాన్ని నిర్భయంగా లోకానికి "సూతపురాణం" ద్వారా వెల్లడించారు.

జన్మాధిక్య సూత్రకారణంగా అగ్రజాతి సంఘంలో తామే పెత్తనం చేయాలనడం, ఇతర జాతులు తమ 'కర్మ' ఫలితం అనుభవించక తప్పదనడం చౌదరిగారిని విస్మయచకితులను చేసింది. ఈ చిత్ర పరిస్థితిని చౌదరిగారు ప్రథమాశ్వాసంలో ఎంత చక్కగా వర్ణించారో చూడండి

'విభుఁడొకఁడు చేయునంటపై పెత్తనంబు !
కర్మయొకఁడు సంసారచక్రంబు ద్రిప్పు
నంట !! ద్వంద్వప్రభుత్వమిందమర లేదె ?
ఎంత కాలంబు సాఁగునో యిట్టిచిట్ట !
దక్షిణాఫ్రికా యందు నిర్దయులు తెల్ల
వారు భారతీయులఁ బెట్టుపాట్లుఁగాంచి
గొల్లుమని యేడ్చు నెంతొ గగ్గోలు పడుచుఁ
బనవుచుండును నీనాఁటి బ్రాహ్మణుండు.
కాని తానుమాత్రమె యంటరానివాండ్రు
ముట్టరాదనుచు ప్రవేశ పెట్టరాదు
పొమ్మనుచునుండు మాలలబోధపడదు
తండ్రి నేటి బ్రాహ్మణుని చిత్తప్రవృత్తి'

దేవభాషయైన సంస్కృతమును అద్విజులు చదవకూడదని, చదివితే నరకప్రాప్తి కలుగుతుందని విప్రులు నిషేధిస్తున్నారని, వివేకవంతులైన మీ అభిప్రాయమేమని చౌదరిగారడుగగా సూతుడు—

'కార్యాకార్య వివేకమున్ దెలిసియున్ గాలుష్యమున్ దూలగా
ధైర్యస్థైర్యములేక ధర్మముల నుద్ఘాటింతురే? భూసురుల్
మర్యాదన్ దిగద్రావి గూఢరతి రామస్వామి! చిత్రంబహో!
ఆర్యావర్తము భ్రష్టమాయెను భళా! యేమికానున్నదో!!'

అన్నాడు. దేవభాష నభ్యసించడానికి శూద్రులకు అర్హత లేదనీ, తెనుగుచదవడానికి భూసురులు యోగ్యులు కారనీ భావించే వారికోసం 'కబీరుదాసు పూర్వజన్మవృత్తాంతం' అను పీఠికలో మనోహరంగా వర్ణించారు.

గోదావరీ మండలంలోని ద్రాక్షారామంలో దేవశర్మ అనే భూసురోత్తమునకు ఒక బాలుడుద్భవించాడు. తల్లిదండ్రులు కుమారునికి 'శాస్త్రి' యని నామకరణం జేశారు. శాస్త్రి చిన్నవయస్సులోనే గురుముఖంగా నన్ని షష్టికళలను నేర్చుకొని, అసాధారణ స్ఫూర్తి పాండిత్యప్రతిభా విశిష్టుడయ్యాడు. శాస్త్రి చక్కని గానకోవిదుడు. కంఠమెత్తి సామగానం చేస్తే తుంబురుడు త్రుళ్ళిపడి తంబురటు వారవేసి, చెవులు రిక్కించి వినవలసిందే. సంస్కృతంలో చదవని చదువేలేదు కాని తెలుగుభాషను చదవడం వారి ఇంట సంప్రదాయం కాదు. అందుచేత శాస్త్రికి ఆ భాషను నేర్పించడానికి దేవశర్మకు ఇష్టంలేదు. కాని అన్ని భాషాలలోనూ పండితుడనిపించుకోవాలనే తాపత్రయంకొద్దీ, శాస్త్రి తండ్రి మాటలను పెడచెవినిబెట్టి తెనుగుభాష నభ్యసించడం మొదలెట్టాడు, ఒక వత్సరంలోనే ఆ భాషను ఆమూలాగ్రంగా నేర్చుకోగలిగాడు. కాని ఏం ప్రయోజనం? తెనుగు చదవడంతో అతనికి 'మనోజాడ్యం మానుసెత్తి' బుద్ధికి విడాకులిచ్చాడు. అతనికి స్వాస్థ్యంలేకుండా పోయింది. దేవశర్మ ఆ రోజుకారోజు దిగులుతో కృశించి పోసాగాడు. ఎట్టకేలకు శాస్త్రి మరణించి కొంతకాలం నరకం అనుభవించి శ్రీరంగంలో ఒక అవుదూడగా జన్మించాడు. పాపం! శాస్త్రి తెనుగుభాషను నేర్చుకొన్నందుకు ఎంత దుర్గతిపట్టింది!

(సశేషం)

**పుస్తకపరిచయము :**

# మనోభూమికలు

రచన:
శ్రీ మాదిరాజు రంగారావు
29 పుటల చిన్న కావ్యం
వెల: రూపాయ.

ప్రకాశకులు:
రసధుని ప్రచురణ
3-4-685 నారాయణగూడ
హైదరాబాదు.

పద్యంలాంటి గద్య రచనలు చేస్తూ ముక్త చ్ఛందస్సులతో రక్తి కట్టిస్తున్న యువకవులలో యీ రచయిత ఒకరు. ఈయన రచించిన కిక్కిరం, మేల్కొన్న ఆకాశం (పూర్వకృతుల) కంటే, యీ కృతిలో వస్త్వైక్యము, భావస్థిమితత్వము ఉన్నవి. అయితే గద్యరచనలో వీరి వాక్యాలూ భావాలూ ఎప్పటికీ తెగవు; కర్తలూ కర్మలూ, విశేషణాలు విశేషాలే కాని క్రియలు కనిపించవు. కామాలే కాని ఫుల్‌స్టాపులు చప్పున గుర్తుకు రావు.

ఆకాశముఖంపై సంధ్యాప్రశ్నలవలె
స్పర్శగుణం, చలనశక్తి, వ్యక్తిత్వం లేని
నడిచే నిలువు నీడల మూకలు
వేగ గమనశీలి కాలం వదలిన ముద్రలు
అగ్నితో మాసిపోని ఊహలతో పూడ్చబడని
మానవుని ప్రగతి చరిత్రలో చీకటి లోయలు
నిశ్శబ్దం సమావరించిన శిలా విగ్రహాల
పాదాల ముందు రాలిన కన్నీటి చుక్కలు
పర్వతాల హృదయకర్కశ స్వభావాన్ని
సంగీతంతో సముద్రానికి చేరవేసే నదులు.

వీరి భావాలు నడచినంత చులుకుగా బండ శిలల వంటి శబ్దాల కదలిక సెలయేటి వంటి వాక్ప్రవాహంలో అడ్డుపడి గద్య కవితను వట్టి వచనం లాగ వట్టి యిచ్చివేస్తుంటాయి. కొన్ని వాక్యాల నిర్మాణంలో ఇంగ్లీషు వాసన చప్పున గుర్తుకి వస్తుంది. వీరి ఆలోచనల కుదుపుతో పాటు, అవి పొదిగిన మాటల పొదుపు అలవరుచుకొంటే, జీవన సంగీతం పాడదలచు కొన్న వీరి కవితా విషయంలో కలస్వనాలు ధ్వనించగలవు. సంస్కృత సమాసాల పోహళింపులో సరియైన అర్థాలు విడివడని మాటల సుడిగుండాలు ఊహాచక్ర ధ్వనిమయ మస్తిష్కంలో తిరిగి తిరిగి జ్వలించి ఏ నాడు ఎప్పుడు బూదికుప్పగా మారు ఈ యగ్ని శిఖాభ తమా శేఖతో, క్షణం భూమిపై నిల్వద్రొక్కి కొనగా, ఊహ లేక; ఒక రాగానికి వశపరించి ఊగిపోవు జీవికి, రాత్రివేళ దూరాకాశ ముందు కనిపించే అమృతాం

కుటుంబంలో విలీనమౌదామని ఉన్నది. భూమిని మరచి ప్రాతరుదార కాంతి పుంజంలా విశ్వాత్మలో ఏకమయి నిరాకారమయిపోతే తప్ప, తనలో దూకితే ఈ యగ్నిని ఆర్ప గలదా? సముద్రం! భూమిని మరచిన యీ "మనో భూమికలు" ఆకాశంలో విలీన మవుతున్నాయి కాని చెప్పదలచుకొన్న అంశాన్ని సూటిగా తెలిసేటట్టు అందజేయలేక పోతున్నాయి. ఈ కవి, "హర్షంతో వేయి రెక్కలు కట్టుకొని ఎగిరే అడవి పిట్టల" కోవలోకి చెందినవాడు; "ఆవల ఏమున్నదో వాటికి తప్ప ఎవరికీ తెలియదు." అందుకే అంటాడు "దూరం సుదూరం వెళ్ళిపోయిన నేను, నామస్తిష్కంలో తిరిగే ఒక ప్రక్కకు ఒరిగిన ప్రపంచగోళం క్రిందికి వాలి పోయిన ఆకాశం, స్థిరమయిన ఉనికి ఎరుగని నీడ బొమ్మలు బుద్ధిని వదలని-తృష్ణతీరని కామనలు దూరం బహుదూరం వెళ్ళి పోయిన నా పాదాల క్రింద ధూళి రేణువులు, నౌకనుచూపు సాగి ఆగి మలగి పోయి శూన్యంలో కలసి మాయమయి నంతవరకు నిల్చుటద్దంలో కన్పించే, ుసవెనుక గీయబడిన పిచ్చి గీతల్లా, నాకు తెలియని నోరులేని లిపి."

నామః తెలియని నోరులేని లిపి, తెలిసే నోరున్న లిపిగా చేయ్యాలని రసగ్రహణ ః శలమ న్నేయిన పాఠకులు ఈ కృతికర్త వద్దనుండి అభిలషించేది.

—శ్రీవాత్సవ

ాఁడు. శా్ర
ురుడు త్రుళ్ళ
కృతంలో చద
సంప్రదాయం
దేవశర్మకు ఇ
అనే తాపత్రయ
ఃభాష వశ్య
ు అమూలా
గు చ ద వ
విజాకులి
ాఁ

# మధూలిక

శుక్‌పబ్లిషర్సు, తెనాలి.
వెల : రూపాయిన్నర.

...గధ కోసలరాజ్యాలకు యుద్ధము జరిగినది. యుద్ధమునకు హేతువు ...ాజకుమారి కోసలరాజకుమారిని అవమానపరచుట అది మన్మదోత్స ...ంలో జరిగినది. ఆ అవమానితుడైన రాజకుమారుడు అశ్వారూఢుడై వేగ ముగా పోవుచు మార్గమధ్యమున శిరిపల్లెవద్ద గుఱ్ఱముమీదనుండి క్రిందపడి మూర్ఛ పోవును. సమయానికి ఆపల్లెలోని మధూలిక అనే అమ్మాయి ఆయనకుపచారాలు చేయును. చేయుచు చేయుచు ఇంకను మూర్ఛనుండి తేరుకొనని ఆ రాజకుమారుని ఆమె ముద్దుపెట్టుకొన్నది. ఆయనలేచి తన దారిన తానుపోయెను.

ఆరెండు రాజ్యములకును యుద్ధము ప్రారంభమైనది. శిరిపల్లె మగధ రాజ్యములోనిది. ఆపల్లె యుద్ధక్షేత్రమైనది. అచటి వారందరును ఎవరిదారిన వారు

మునియందు వలపున్నది గదా! అందువలన తన యవస్థనొక పావురముతో దీన ముగా చెప్పుకొన్నదొకనాడు. అది ఆరాజకుమారుడు విన్నాడు. దానితో ఆయ నకు యుద్ధవైముఖ్యమేర్పడినది. యుద్ధము మానుకొనినాడు. మగధరాజ్యముతో సంధి చేసికొనినాడు. మధూలికతో సుఖముగా నున్నాడు.

ఇది అభ్యుదయప్రబంధమని రచయితయే వ్రాసికొనెను. ప్రబంధములో కథ జాలుగానుండును. ప్రకృతివర్ణన అధికముగా నుండును. ఈ గ్రంథమునను అంతే. పైగా ఇందలి వర్ణనలన్నియు, ఆ ఉన్నకథాగతి కనివార్యములైనవిగావు. ఈ గ్రంథము మొత్తముమీద కానవచ్చు అభ్యుదయభావము యుద్ధవైముఖ్యము. కోసలరాజకుమారునిలో ఏతద్వైముఖ్యము కలుగుటకు హేతువు మధూలిక. ఆమె ఆయనను ప్రేమించినది. ఆయన ఆమెనుగూడ అట్లే. చివరకాయన అనినాడు—

"నీకునై నా ప్రణయ శుకి! నిజమునమ్ము
మగధతో చెల్మినందుదు పగను మఱతు"

ఈ గ్రంథములోని పాత్రములలో మధూలిక ప్రధానమైనది గదా! ఆమె మాటాడును. మగధరాజ సైనికులు శిరిపల్లెను చేరినపుడు మధూలిక యుద్ధము శ్రేయముకాదని యుపన్యాసము చేయును. ఈ చేయుట ఆ పాత్రము సంస్కార మునకు అందనివిధముగా నున్నది. అసలా కోసలరాజకుమారుని అవమానపరచు టయే చాల పేలవముగానున్నది. శ్రీ దుర్గానంద్ ఇంతకు పూర్వము అంతర్గోశాలు అన్న ఖండకావ్యమును వ్రాసెను. అది గేయములలో వ్రాసెను. అది బాగున్నది. ఈ మధూలిక గ్రంథమున కేవలము కవియొక్క అదుపులో పెట్టు కొనలేని ఆవేశపుటూహాలు మిక్కుటముగా నున్నవి. వాటికవి పరమ రమణీయ ములు. గ్రంథములోనొక కథనుపెట్టి పాత్రలను ప్రవేశపెట్టిన తరువాత వాటిపరిస రాలు-సంస్కారము ఇత్యాదుల విషయమున కవి జాగరితుడు కావలయును. ఇది ప్రత్యేకము కావ్యరచనా శిల్పవిద్య.

తెలుగు దేశములోని అభ్యుదయ కవిత్వ మనబడునది అధికముగా రూప కాలంకారము నాశ్రయించి యున్నది. ఈ కవిత్వమున శబ్దాలంకారములును మిక్కుటము. శ్రీ దుర్గానంద్ నూత్న నూత్నములైన రూపకములతో నీప్ర బంధమునందలి పద్యములను రచించెను. పద్యములు వ్రాయుటయందు కవి అధి కముగా జాగ్రత్తపడెను. ఈ గ్రంథము మొత్తము ఐదువందల పద్యములతో నున్నది. కొన్ని పద్యములు రచయిత ఏదోమనసున పెట్టుకొని వ్రాసినట్లు కని పించును. ఆ రచయిత మనసులో నున్న దానిని ద్యోతకముచేయు శక్తి అందుకుగా నుపయోగింపబడిన శబ్దాలకు లేదు. అందువలన అస్పష్టతయుండును ఇది కొన్ని చోట్ల మాత్రమే.

"శిరిపల్లెలు రణముకై చెడవు! చెడవు!!
నిండు పున్నమవంటి ధావీతి సఖుడ!

సాగి పోదము! ఆ భవిష్యత్తులోకి
తమము చన్న ఈ నవయుగోదయము వేళ."

ఈ గ్రంథమంతయు నీ తాత్పర్యముతో వ్రాయబడినది. నేటి అభ్యుదయ భావుకులలో శ్రీ దుర్గానంద్ ఎన్నబడవలసిన వ్యక్తి. ప్రతిభావంతుడు శ్రీ దుర్గానంద్. ఈ గ్రంథము జాగ్రత్తగా పఠింపదగినది.

— క్షేమేంద్ర.

## విజయ భారతి

గ్రంథకర్త :
శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి

ప్రతులకు :
భారతీనికేతన్
మారుతీ నగర్, విజయవాడ-2

ఆంధ్రసాహిత్యంలో గేయం ప్రచారసాధనంగా ప్రథమ స్థానాన్ని ఆక్రమించుకుంది. సామాన్యప్రజల హృదయాంతరాళాల్లోకి గేయం సులభంగా చొచ్చుకొని పోగలుగుతుంది. భారతమాత దాస్యశృంఖలాలను విచ్ఛేదం చేయడానికి, నిద్రాణమైన జాతిని జాగృతిపొందించటానికి అనేకమంది కవిపుంగవులు గేయాన్నే తమ ప్రచారసాధనంగా వాడారు. సామాన్యప్రజలలో చైతన్యం కలిగించి, నూతనోత్సాహాన్ని, ఉత్తేజాన్ని రేకెత్తించే శక్తి గేయానికుండబట్టే స్వాతంత్ర్య సమరరంగంలో భారతీయులు బ్రిటీషువాళ్ళ లాఠీదెబ్బలనూ, తుపాకిగుండ్లనూ సైతం లెక్కచేయకుండా బంకించంద్రచటర్జీ రచించిన 'వందేమాతరం' గేయాన్ని ఐక్యకంఠంతో గానంచేశారు. స్వాతంత్ర్యసముపార్జనకై రవీంద్రుని 'జన గణ మన' గేయం మహత్తరమైన ప్రచారం చేయగలిగినది.

ఆంధ్రదేశంలోని కవులుకూడా స్వాతంత్ర్య సమరంలో ముందంజవేసి, ప్రజానీకంలో జాతీయతనూ, దేశభక్తినీ, త్యాగబుద్ధినీ ప్రబోధించే గేయాలనేకం సృష్టించారు. ముఖ్యంగా గురజాడవారి 'దేశమును ప్రేమించుమన్నా' శ్రీ శంకరంబాడి సుందరాచారిగారి 'మా తెలుగుతల్లికి మల్లెపూదండ', శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణగారి 'మాకొద్దీ తెల్లదొరతనం', కవిరాజు, శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరిగారి 'వీరగంధము తెచ్చినారము, వీరుడెవ్వడో తెల్పుడీ' లాంటివి ఉత్తమశ్రేణికిచెందిన జాతీయగేయాలు. ఈ గేయాలు స్వాతంత్ర్య పోరాటపు రోజులలో ప్రతి ఇంటికీ విప్లవసందేశము నందజేసి వాటి కర్తవ్యాన్ని నెరవేర్చు

ప్రస్తుత 'విజయ భారతి' గ్రంథకర్త పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారు ఆధునిక జాతీయ గేయకవులు. వీరికి జాతీయనాయకులపై మిక్కుటమైన మక్కువ. లోగడ రచించిన 'జాతీయభారతి' తోనే వీరిపేరు ప్రసిద్ధికెక్కినది. 'త్రిలింగ దేశము మనదేనోయ్, తెలుంగులంటే మనమేనోయ్' అనే గేయాన్ని బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు ఆంధ్రులకు జాతీయగేయంగా ఉండదగినదని ప్రశంసించారు. ఈ 'విజయ భారతి' లో గూడా కవియొక్క జాతీయస్వరూపము గోచరించుచున్నది. ఇందులో 27 గేయాలున్నాయి. ఇందులోని గేయాల్లో ఏ ఒక్కటీ కూడా పై పేర్కొన్న గేయాలతో తులతూగజాలవు. కారణం సుబ్బరామశాస్త్రి గారి గేయాలలో కళాదృష్టి లోపించడమే. కవిత్వదృష్ట్యా కూడా గేయాలలో రుచికొంచెం తక్కువనే చెప్పవలసిఉంది. గేయం ఎంతప్రచార సాధనమైనా భావలో జిగిబిగి, భావంలో పటుత్వం ఉన్నప్పుడే అది శాశ్వతంగా నిలుస్తుంది.

త్రివర్ణ పతాకరంగులో గ్రంథాన్ని అతి ఆకర్షణీయంగా వెలువరించి నందులకు శాస్త్రిగారికి అభినందలు.

—త్రిపురనేని సుబ్బారావు

# లచ్చి నవ్వింది

## ( కథాసంకలనం )

రచయితలు :
'కొలిపాక' 'పబ్బరాజు'
పుటలు : 74, వెల : రు. 1-00,

ప్రతులకు :
మిత్రమండలి
ఖమ్మంమెట్టు.

ఇందులో 'కొలిపాక' వారి కథలు, 'తెగిపోయిన గాలిపటం' చేసిన పాపం' లచ్చి నవ్వింది అనేవీ, పబ్బరాజుగారి, పరిసరాలు, రిజూవాలా, అన్వేషణ, ఋణానుబంధం, కన్నీటి చుక్కలు-అనే కథలూ ఉన్నాయి.

ఈ నాటి సాంఘికజీవనం బహుముఖంగా విస్తరించిఉంది. పైకికనిపించేవీ, తెరమరుగున ఉండిపోయేవీ ఎన్నో సంఘటనలు జీవితాన్ని చుట్టుముట్టు కొని ఉన్నాయి. వ్రాయగలగాలేగానీ. కథకునికి వస్తువులోపం అంటూ ఏనాడూ లేదు. ఈ రచయితలు, తమ పరిసరాలనుండి కథా వస్తువును తీసుకొని అందంగా చిత్రించారు. ప్రయత్నించినట్లయితే ఇంతకన్నా అందంగా వీటిని రాయవచ్చునని పిస్తుంది, వీరినుండి ఇంకా మంచి కథలు వస్తాయనే ఆశిద్దాం.

—రవీంద్రనాథ్

# సంఘం

పేజీ 164 18-11-91

సంపాదకుడు :—లవణం

కార్యాలయం
ప్రొద్దుటూరు, కడప జిల్లా

విడిప్రతి 25 న. పై.
సాలుకు ఆరురూపాయలు
ఆరునెలలకు మూడురూపాయలు

దేవుడు ఉన్నాడని ఎక్కువగా ప్రచారంచేసినా దోషాలు ఉంటాయి. దేవుడు లేడని ఎక్కువ ప్రచారంచేసినా దోషాలు ఉంటాయి. అతి అన్నిటికి ఇబ్బందే. సమాజం దేన్నీ అతిగా పోనివ్వదు. అయినా పోరాడే శక్తులు సంఘంలో ఎప్పుడూ అవసరం 'సంఘం' పత్రిక చివరకు దేవుడు ఉన్నాడని లేదని ప్రజలలో తెల్పినా తెల్పకపోయినా ఎటు తిరిగి అది తేలే ప్రశ్న కాదు కాబట్టి ఆ రకమైన తాత్విక చర్చ పెరిగి మనస్సుకు ఒకవిడి కలిగి కన్నులమీదఉన్న మాంద్యాన్ని భారాన్ని అది విడిపోయే టట్లు చేస్తే చాలా మేలు. పోతే తాత్విక చర్చకు విషయం ఎంత అతిశమూ అస్పష్టము అయిందిగా ఉంటే రాజంపో రాజకీయ దృక్పథానికి అంత నగ్నమూ స్పష్టమూ అయిన విధానం ఉంటే మంచిది. అన్నిటిలో మంచి మంచి తీసుకుని చేర్చుకునే నీతి మంచివాడు కావడానికి పనికి వస్తుందేమో కాని రుగ్ణతకు సరైన చికిత్స మాత్రం కాదు. సంఘం పత్రిక కొన్ని వ్యాసాలను, దాని తత్వాన్ని చూస్తే ఇది సంఘంలోని ఒక లోటు చైతన్యాన్ని పూరించగలుగు తుందని ఆశ కలుగుతుంది. సత్ప్రేరణతో సదాశయసిద్ధికి పాటు పడే ఈ పత్రిక శుభాకాంక్షలో జాషువాగారు అన్నట్లు వేదాంత దుర్దాంతకృతమై స్వలాభపరమై తార్మారుగా ఉన్న ఈ పెను చీకట్లను దూరీకరించగల దనుటలో సందేహం లేదు.

—రాజు

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర

ఖైరతాబాదు - హైదరాబాదు-4

## ప్రచురణములు

| | | |
|---|---|---|
| హిందీ ప్రచార్ కా ఇతిహాస్ | | రు. 10-00 |
| నెలవంక | .... | 2-00 |
| ప్రహ్లాదచరిత్ర | . | 1-50 |
| శ్రీకృష్ణరాయబారము | .. | 1-50 |
| కథాతోరణము | | 2-00 |
| కావ్యతోరణము | .... | 1-50 |
| హిమబిందు | | 1-50 |
| ప్రతిజ్ఞాయౌగంధరాయణము-స్వప్నవాసవదత్త | | 1-50 |
| దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు జీవితము (మొదటి భాగము) | | 2-25 |
| నవరత్నావళి | .... | 2-00 |
| నెహ్రూచరిత్ర | .... | 2-50 |
| హిందీ ప్రచారోద్యమము దాని స్వరూపము | .. | 0-75 |

ఇవి గాక దక్షిణ భారత హిందీ ప్రచార సభ ప్రకటించిన పుస్తకములు, గ్రంథాలయములకు పనికివచ్చు హిందీ సాహిత్యమునకు సంబంధించిన వివిధ పుస్తకములు మావద్ద లభించును.

Edited, Printed and Published by Ch. Lakshminarayana Sarma, Secretary, Dakshina Bharat Hindi Prachar Sabha-Andhra, 959, Khairatabad-Hyd-4 and Printed at Dakshina Bharat Press, Khairatabad, Hyderabad-4.